శ్రీః

# వైశ్వదేవమీమాంసా

**For REFERENCE ONLY**


గ్రంథకర్తా:

దైవజ్ఞ సార్వభౌమ, వేదార్థప్రకాశః

## చివుకుల వేంకటరమణశాస్త్రి

( శ్రీ విద్యాపరిషత్ )


శ్రీవిద్యాపరిషది ఉపన్యస్తా తత్సభ్యైరనుమోదితాచ


– ప్రకటితాచ –

బ్రహ్మశ్రీ రాయప్రోలు లింగనసోమయాజిభిః

మల్లేపెద్ది సాంబశివశాస్త్రిభిశ్చ

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.

శ్రీః

# వైశ్వదేవమీమాంసా

"ప్రజాపతిరకామయత । ప్రజాస్సృజేయేతి । సముఖత స్త్రివృతం నిరమిమీత... తమగ్నిర్దేవతాన్వసృజ్యత గాయత్రీ ఛందసాం। బ్రాహ్మణో మనుష్యాణాం... తస్మాత్తే ముఖ్యాః ముఖతోహ్యసృజ్యంత." తై. సం. ౭-౧.

అనగా ప్రజాపతి దేవ, మనుష్యాదిసృష్టిని చేయుసమయమున తనముఖమునుండి అగ్ని యను దేవతను, గాయత్రి యను ఛందస్సును, బ్రాహ్మణుడను, మనుష్యుని సృజించెను. గాన ప్రజాపతియొక్క ముఖజన్య సామ్యమునుబట్టియు, 'ఆగ్నేయో వై బ్రాహ్మణః' అను శ్రుత్యంతరమునుబట్టియు బ్రాహ్మణుడు సర్వదా అగ్ని దేవత నుపాసించువాడు.

ఇందు బ్రహ్మచర్యాశ్రమమునందు, సాయం ప్రాతః కాలములందు తాత్కాలికముగా నగ్నిని ప్రతిష్ఠించి అందు సమిదాధానరూపమగు 'అగ్నికార్య' మను అగ్నిదేవతోపాసన చేయబడును.

ఇక వివాహసమయమందు భార్యతోగూడ ప్రాప్తించు నగ్ని నదిమొదలు లిద్దరిచేతను సమానఫలముతో నుపాసించబడు దేవతగాన ఈ అగ్నికి 'వైవాహికాగ్ని' యను సంజ్ఞ గలదు.

కావుననే ‘ వైవాహికాగ్నౌ కుర్వీత ’ యని 3-౬౭ మనువును. ‘ కర్మస్మార్తం వివాహాగ్నౌ కుర్వీతప్రత్యహం గృహీ ’ ౧-౯౭ యని యాజ్ఞవల్క్యుడును వాడిరి. ఇది జన్మాంతము లేక గార్హస్థ్యపరిసమాప్తిపర్యంతము గృహస్థుచే నుపాసింపబడును. గాన దీనికే ‘గృహ్యాగ్ని’ యనిగూడా సంజ్ఞ-గృహశబ్దమునకు భార్య యను నర్థమున్నట్లు ‘సగృహః ప్రయాస్యన్నాప్తోష్వతీయం జుహోతి’ యను నాపస్తంబశ్రౌతసూత్రముచే తెలియవచ్చుచున్నందున భార్యాసంబద్ధమగు నగ్ని యగుటయుం జేసియు, ‘గృహ్యాగ్ని’ యను నభిధానము సిద్ధించును.

ఇయ్యది త్రేతాగ్నులవలె మూడుస్థానములందుండక నొకేస్థానమందుండును గాన దీనికే ‘ ఏకాగ్ని ’ యని గూడ సంజ్ఞ-గృహశబ్దమునకు పర్యాయపదమగు అవసథశబ్దమును పురస్కరించుకొని తద్ధితప్రత్యయాశ్రయణముచే ‘ఆవసథ్యాగ్ని’ యని దీనినే కాత్యాయనుడను కల్పసూత్రకారుడనెను.

ఇట్టి అగ్నియందు ప్రతిగృహస్థుచేతను అవశ్యమాచరింపదగిన కర్మవిశేషములకు ‘ పాకయజ్ఞము ’ లని సంజ్ఞ- ఇవి హుత, ఆహుత, బ్రహ్మణిహుతములను మూడు భేదములతో నొప్పునని ఆశ్వలాయనుడనెను. యజ్ఞమనగా దేవతోద్దేశ్యక ద్రవ్యత్యాగమని జైమినిమహర్షియు ఆపస్తంబాదులున్ను నిర్వచించిరి.

ఇక పాకశబ్దమన్ననో లోకప్రసిద్ధి ననుసరించి వండబడిన వస్తువు అను నర్థమందు వాడబడుచున్నది. కావున వండిన

అన్నాదులు ద్రవ్యముగాగల యాగము పాకయజ్ఞ మనబడు నని లోకప్రసిద్ధివల్ల తేలుచున్నది. ఇట్టివి ప్రాయణీయ ఉదయనీయాది శ్రౌతకర్మలందునుగూడ గలవు. గాన నిచట లోకప్రసిద్ధి నాశ్రయింపగూడదు.

కావున వేదప్రసిద్ధియే అనుసరణీయము. 'యోస్మాత్పాకతర ఉన్నివపతి' యను శ్రుతియందు పాకశబ్ద మల్పార్థ మందుపయోగింపబడినది. 'తం పాకేన మనసాపశ్యం' - 'యోమాపాకేన మనసా' ఇత్యాది శ్రుతులందు పాకశబ్దము ప్రశంసార్థమం దుపయోగింపబడినది. కావున పాకశబ్దమునకు శ్రౌతములగు నల్పత్వ, ప్రశంసాత్వరూపములగు నర్థములనే గ్రహింపవలయును.

జ్యోతిష్టోమాది శ్రౌతయజ్ఞాపేక్షయా నీ పాకయజ్ఞములు అనుష్ఠానాయాస ద్రవ్యకాలాదులచే నల్పములైనను ఫలవిషయమై ప్రశంసనీయమైనవి కావుననే యల్పత్వ ప్రశంసాత్వరూపమగు నర్థద్వయ ముపపన్నమగును.

ఈ పాకయజ్ఞము నెపుడు, ఎట్లు, ఏమంత్రములతో నేక్రమమున ఆచరింపవలయు ననువిషయమును మనకు బోధించునవి గృహ్యసూత్రములు. వీటికర్తలగు ఆపస్తంబాదులు శ్రౌతయాగముల కన్నిటికి వలయు దేశ, కాల, ద్రవ్య, మంత్రక్రమాదులను లోకమున కుపదేశించిన శ్రౌతసూత్రకారులేగాని సామాన్యులుగారు.

ఈ పాకయజ్ఞములలో వైశ్వదేవ మొకటి. ఈ శబ్దము నకు 1. విశ్వేదేవతలను ప్రసిద్ధిగల దేవతల నుద్దేశించి చేయు బడుయాగము అని యొకఅర్థమున్ను, 2. విశ్వే = సమస్తమైన లేక అనేకమైన దేవతల నుద్దేశించి చేయబడు యాగమని మరియొక యర్థమున్నూ భాషామర్యాద ననుసరించి భాసించును. గాని వేదమర్యాద ననుసరించి విమర్శించి చూతము.

వేదమందు చాతుర్మాస్యలను ప్రసిద్ధికెక్కిన హవిర్యాగములందు మొదటిదానికి 'వైశ్వదేవ' మను సంజ్ఞయున్నట్లు 'వైశ్వదేవేనయజేత' యను విధివలన తెలియుచున్నది. అద్దానియొక్క స్వరూపము బ్రాహ్మణముచే నిట్లు వివరింపబడి నది. 'ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతి। సౌమ్యం చరుం। సావిత్రం ద్వాదశకపాలం। సారస్వతం చరుం। పౌష్ణం చరుం। మారుతం సప్తకపాలం। వైశ్వదేవీ మామిక్షాం॥ ద్యావా పృథివ్యమేకకపాలం॥' అని తై. సం. ౧-౮-౨. దానంజేసి అగ్ని, సోమ, సవితృ, సరస్వతీ, పూషా, మరుత్, విశ్వేదేవ, ద్యావాపృథువులను యెనిమిది దేవతలుగల సమప్రధానమగు యెనిమిది యాగ విశేషముల సముదాయమునకు 'వైశ్వదేవ' మనునది నామధేయమని యీశ్రుతిప్రసిద్ధివలనను మీమాంసా శాస్త్రమందలి ౧-౪-౧౧ అధికరణన్యాయమువలనను తేలినది. సంకల్పహవిర్నిర్వాపాదులకీ నామధేయ ప్రయోజనముండును.

అట్లే అశ్వమేధయాగమందు మేధ్యాశ్వమును వదలి నది మొదలు తిరిగి వచ్చువరకు ప్రతిదినమున్ను, 'దీక్షాహుతి

భిస్సహ వైశ్వదేవం ప్రత్యహం జుహోతి' అను కల్ప సూత్రమువలన ప్రకృతియగు అగ్నిష్టోమమందలి దీక్షాహుతులగు 'ఆకూత్యై ప్రయుజేఽగ్నయే స్వాహా' ఇత్యాదులతోపాటు 'వైశ్వదేవ' హోమమును చేయవలయునని తెలియుచున్నది. ఇచటి వైశ్వదేవశబ్దమునకర్థము తై. సం. ౭-౩-౧౬ లో 'స్వాహాధిమాధీతాయ స్వాహా' మొదలు 'సర్వస్మై స్వాహా' వరకు గల ౨౨ దేవతలనుద్దేశించి చేయు ౨౨ హోమరూప యాగములే యని బ్రాహ్మణము వివరించినది.

అట్లే యిచటకూడ వైదికప్రసిద్ధినిగాని, మర్యాదనుగాని అనుసరించి కొన్ని యాగముల సమూహమునకు ఈ వైశ్వదేవము నామధేయము గావలెను.

అట్లైన నేయాగముల సమూహమునకీసంజ్ఞ యని యొకింత విమర్శింతము. పై రెండుప్రకరణములందును బ్రాహ్మణ నిర్వచనానంతరము "వైశ్వదేవేనయజేత" యను ప్రత్యక్ష శ్రుతిచే నా యాగములకు వైశ్వదేవనామమున్నట్లు తెలియుచున్నది. కాని ఇచట నట్టి శ్రుతి మనకు ప్రత్యక్షముగా గోచరించుటలేదు. అయినను ఒకానొక వేదభాగమందు అయిదు యజ్ఞములు విధింపబడుట మనకు ప్రత్యక్షప్రసిద్ధము. వాటిని ముందు తెలిసికొని వాటికి శ్రౌతసూత్రములందు అనుష్ఠాన క్రమము బోధింపబడియుండెనో లేదో విచారించి ఆ యజ్ఞ సమూహమునకే 'వైశ్వదేవ' సంజ్ఞ, కర్మనామధేయమగు నేమో విచారించిచూతము.

అట్టి వేదభాగము స్వాధ్యాయబ్రాహ్మణము. అందిట్లున్నది. 'పంచవా ఏతే మహాయజ్ఞాః సతతి ప్రతాయంతే సతతి సంతిష్ఠంతే దేవయజ్ఞః పితృయజ్ఞో భూతయజ్ఞో మనుష్యయజ్ఞ ఇతి' అని. ప్రతిదినము ప్రారంభింపబడి సమాప్తినొందింపబడు నీ అయిదుయజ్ఞములపేర్లను బోధించి వాటిస్వరూపము నిట్లు ఆ శ్రుతియే యుపదేశించుచున్నది.

'యదగ్నౌ జుహోత్యపిసమిధం తద్దేవయజ్ఞస్సంతిష్ఠతే
యత్పితృభ్యస్స్వధాకరోత్యప్యపస్తత్పితృయజ్ఞస్సంతిష్ఠతే
యద్భూతేభ్యోబలిగ్ంహరంతి తద్భూతయజ్ఞస్సంతిష్ఠతే
యత్స్వాధ్యాయమధీయీతైకామప్యృచం యజుస్సామవా
తద్బ్రహ్మయజ్ఞస్సంతిష్ఠతే'— అని.

ఇందు బ్రహ్మయజ్ఞేతర యజ్ఞచతుష్టయమందు దేవతోద్దేశ్యక ద్రవ్యత్యాగరూప యజ్ఞలక్షణము పట్టినది. ఇందు దేవయజ్ఞమన నగ్నియందు సమిధనైనను హోమము చేయుటయే యను నిర్వచనమునుబట్టి గార్హపత్యమందా? ఆహవనీయమందా? దక్షిణాగ్నియందా? లేక గృహ్యాగ్నియందా? హోమముచేయుట యను సందేహమున్ను 'అపిసమిధం' యనుటచే సమిధేతరోత్కృష్టవస్తువు లేవి? యను సందేహమున్ను గలుగుచున్నవి. అట్లే పితృయజ్ఞమందు పితృదేవతల నుద్దేశించి ఎచట స్వధాకరణము చేయవలెను? అను సందేహమున్ను 'అప్యపః' యనుటచే ఉదకేతరోత్కృష్టవస్తువు లేవి? యను సందేహమున్ను గలుగుచున్నవి. అటులనే భూతయజ్ఞమందు ఏయేభూతముల నుద్దేశించి ఎచట, ఏద్రవ్యముతో బలి

యివ్వవలెను ? అను సందేహము కలుగుచున్నది. అట్లే మనుష్యయజ్ఞమందు ఎట్టి బ్రాహ్మణులకు ఎట్లు అన్నదానము చేయవలెను? దానికి మంత్రము లేవి? లేక అయ్యది అమంత్రక దానమా? ఆయన్నము నెచట నండవలెను? వండినయన్నమును యథాలేథముగా దానముచేయవచ్చునా? లేక ముందు ఏమైనా సంస్కార మవసరమా ? రోజుకొకమారా ? రెండుమార్లా అనేకపర్యాయములా ? యను సందేహములు కలుగుచున్నవి.

ఈ నాల్గు యజ్ఞములలో నేది ప్రథమకర్తవ్యము ? ఏక్రమమున వీటి నాచరింపవలెను? ఒకదాని కొకదానికి మధ్య వ్యవధాన ముండవచ్చునా ? లేక ఈ నాల్గింటి సమష్టికి 'వైశ్వదేవ' సంజ్ఞ విధింప నర్హమా? మొదలగు సందేహము లన్నిటికి సమస్తవేదములకున్ను ప్రకరణవిభాగమును, కర్మవిభాగమును, మంత్రవిభాగమును చేసి సమస్త వినియోగములను బోధించిన కల్పసూత్రకారులుతప్ప అన్యులెవరు సమాధాన మీయగలరు ? వా రేమి సమాధానమిచ్చిరో పరిశీలింతము.

ఒకవేళ ఈ యజ్ఞసమూహమునకు వైశ్వదేవ మనుకర నామధేయము కుదరనిచో నియ్యది ప్రత్యేకయాగము కావలయును. అట్లయినచో యాగమనగా ద్రవ్యదేవతాస్వరూపము గావున ప్రకృతయాగనామమగు వైశ్వదేవశబ్దముచే దీనికి దేవతలుగా సమస్తదేవతలుగాని లేక విశ్వేదేవులను సంజ్ఞతో బరగు దేవతలుగాని దెలియవచ్చుచున్నారు. కాఁగా నిక నిందలి ద్రవ్య మేదియో విచారింపవలయును.

ప్రత్యక్షముగా నీ వైశ్వదేవమం దీద్రవ్యమని బోధించు శ్రుతి దొరకలేదు. గాని అగ్నిహోత్రప్రకరణములో కొంత ద్రవ్యము కాలాంతరోపయోగమునకై నిర్దేశింపబడి యున్నట్లు తెలియుచున్నవి. కావున నద్దానిని ముందు తెలుసుకొని అది ఈ కర్మలో ద్రవ్యమగునేమో విచారింతము. ఇట్టి విచారణ వలన రోజున కొక పర్యాయమా లేక రెండుపర్యాయములా యీ వైశ్వదేవ మను సందేహముకూడ నివృత్తమగును.

అగ్నిహోత్రప్రకరణమును బోధించు తైత్తిరీయ బ్రాహ్మణము ౨-౧ లో నిట్లున్నది. అందు 'ప్రజాపతిరకామయత... తస్మాదగ్నిహోత్రముచ్యతే' అను గ్రంథముచే ప్రతివాడును తన ప్రాణాదుల తృప్తికొరకు చేయుకర్మగాన అగ్నిహోత్ర మను నామము గలదని అగ్నిహోత్రశబ్ద నిర్వచన మొనర్చి ఆపైని 'ప్రజాపతిరగ్నిమసృజత... తస్మాదగ్నిహోత్రముచ్యతే' యను గ్రంథముచే సర్వభూతములయొక్క ప్రాణతృప్తికొరకు చేయబడుకర్మగాన దీనికి అగ్నిహోత్రమను పేరుగలిగినది యని మరియొక నిర్వచన మొనర్చి ఆపైన 'తస్యపృథివీసదః అంతరిక్ష మాగ్నీధ్రం ద్యౌర్హవిర్ధానం' ఇత్యాదిగా నీఅగ్నిహోత్రమందు సోమయాగమును కల్పనజేసి సోమయాగమందు దక్షిణగలదే ఈ అగ్నిహోత్రమందు దక్షిణ యేది? యను నాశంకను 'యత్తోదదాతి సాదక్షిణా' యను వాక్యములచే పూరించెను.

ఇందు దానములో ద్రవ్యమేది? ప్రతిగ్రహీత లెవరు? యను నాశంకను ఆపైయనువాకమిట్లు వారించుచున్నది.

"సాయం యావానశ్చ వై దేవాః ప్రాతర్యావాణశ్చాగ్నిహోత్రిణో గృహమాగచ్ఛంతి। తాన్యన్నతర్పయేత్। ప్రజయాస్య పశుభిర్వితిష్ఠేరన్। యత్తర్పయేత్। తృప్తా ఏనం ప్రజయా పశుభిస్తర్పయేయుః"

ఇందలి సాయంప్రాతశ్శబ్దములు కేవల కాలవాచకములు గాక నొక విశేషాభిప్రాయమును గల్గియున్నవి. ఎట్లనగా పూర్వము ప్రజాపతి దేవ మనుష్య పశ్వాదులను సృజించి వారు తమకందరకు ఆహారమును కోరగా ప్రజాపతి దేవ మనుష్యాదులకు భిన్నభిన్నములగు నాహారములిచ్చుచో వారలు తన యందు వైషమ్య నైర్ఘృణ్యాదిదోషముల నారోపింతురని తలచి తన్నివారణార్థమై నొక యోగ్యపు అగ్నిహోత్రమును హోమద్రవ్యమును నిర్మించి దేవమనుష్యాదుల నందరను పిలిచి 'మీ రందరు ప్రత్యేకముగా నీయగ్నిహోత్రమందు ఈ ద్రవ్యమును హోమము చేయుడు. మీ మీ హోమానంతరము అగ్నిహోత్రమం దెట్టి ద్రవ్యము, ఎన్నిమార్లు ఉత్పన్నమగునో అట్టిదియే అన్నపర్యాయములు మీకాహారమగును.' అని వారల కందరికిని బోధించి వారలందరిచే నట్లే చేయించె ననియు మనుష్యులకట్టి హోమానంతరము సాయంప్రాతః కాలద్వయమందు భోజన ముత్పన్నమాయెననియు ఈ తైత్తిరీయశ్రుతి—"మనుష్యా అపశ్యం చ మసంభృతస్య పూర్ణగ్ స్వధాం। త ముపోదతిష్ఠన్త మజుహవుః। తేన ద్వయీమూర్జ మవారుంధత। తస్మాద్ద్విరహ్నో మనుష్యేభ్య ఉపహ్రియతే ప్రాతశ్చ సాయంచ — తై. బ్రా ౧-౪-౯. బోధించుచున్నది.

ఈ శ్రుతి ననుసరించి ప్రకృత సాయంప్రాతశ్శబ్దములు సాయం ప్రాతర్భోజనకాలములని గ్రహింపవలయును. కాన అట్టి రెండు భోజనకాలములందును దేవతలు గృహస్థుని ఇంటికి వత్తురట. వారిని తృప్తినొందింపనిచో నీతని ప్రజాపశువియుక్తునిగాను వారిని తృప్తినొందించినచో నీతని ప్రజాపశు సమృద్ధునిగాను చేతురట.

ఇట్లు బోధించి ఆ దేవతలకొరకు అగ్నిహోత్రకాలమందే హవిర్నిర్దేశము నిట్లు

'సజూర్దేవైస్సాయంయావభిరితి సాయగ్‌ంసంమృశతి
సజూర్దేవైః ప్రాతర్యావభిరితి ప్రాతః' అని తైత్తిరీయశ్రుతియు
'గార్హపత్యే హస్తం ప్రతితప్య సజూర్దేవైరితి వ్రీహీన్యవాన్వా తండులాన్వాసంమృశతి' యని కల్పసూత్రమున్ను విధించు చున్నవి.

ఇట్టి వ్రీహ్యాదులను భోజనకాలమందు ఇంటికివచ్చు దేవతలకు వినియోగించి వారిని తృప్తినొందింపవలయునని శ్రుత్యుపదేశము.

ఇట్టి వ్రీహ్యాదులతో తృప్తిచెందుచూ గృహస్థుని ఇంటికి వచ్చు దేవత లెవరను నాశంకను వారించుటకై 'యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణేవసంతి తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివే దివే నమస్కుర్యాన్నాశ్లీలం కీర్తయేదేతా ఏవ దేవతాః' యను శ్రుతి వేదవిదులగు బ్రాహ్మణులే దేవతలని బోధించుచున్నది.

ఇట్టి వ్రీహ్యాదుల నెచట నుంచవలెను? దాని కేమైనా సంస్కార మున్నదా? లేక ఆ సంస్కృతాన్నము నే పై దేవతల కివ్వవచ్చునా? అపుడేమైన మంత్రములున్నవా? ఇందు కేమైన లోటువచ్చునెడల అగ్నిహోత్రము పూర్తి కాదుగదా? యను నీయాశంకలకు సమాధానముల నన్నిటిని కల్పసూత్రకారులే బోధింపవలెను గదా!

మరియు 'అన్నేన ప్రాణాః ప్రాణైర్బలం బలేన తప స్తపసా శ్రద్ధా శ్రద్ధయా మేధా మేధయా మనీషా మనీషయా మనో మనసా శాంతి శ్శాంత్యా చిత్తం చిత్తేనస్మృతిగ్ స్మృత్యాస్మారగ్ స్మారేణ విజ్ఞానం విజ్ఞానే నాత్మానం వేదయతి తస్మాదన్నం దదన్సర్వాణ్యేతాని దదాతి' యను తైత్తిరీయ శ్రుతి. ఆర ౧౦-౭౦ ఒకానొక అన్నవిశేషముచే ప్రాణ, బల, తప శ్శ్రద్ధాదిపరంపరాక్రమముచే ఆత్మవేదనము కలుగు ననియు, అట్టిదానమును యథావిధిగా జేయువాడు బలాది ఆత్మ వేదనపర్యంతములగు నన్నిటిని దానమిచ్చువాడే యగుననియు బోధించుచున్నది.

ఇంకలి అన్నవిశేష మేది? ఎట్లు ఎవరికి దానముచేయ వలయును? అను విషయములో సమాధానమునుగూడ కల్పసూత్రకారులే మనకు బోధింపవలెను. కాన వారి సమాధానములను పరిశీలింతము. ముందు ఆపస్తంబుని కల్పసూత్రమును విచారించి ఆపైని ఇతరకల్పసూత్రములను విచారింతము.

ఆపస్తంబ కల్పసూత్రము— ఈ కల్పసూత్రము 30 ప్రశ్నలలో నొప్పుచున్నది, ఇందు మొదటి 23 ప్రశ్నలు దర్శ

యాగాది సంవత్సర సత్రయాగపర్యంతమగు యాగవిషయము లను బోధించినవి. ౨౪ వ ప్రశ్నలో శ్రౌత స్మార్త కర్మ పరిభాషలు ప్రవరఖండ హౌత్రమంత్రములు బోధింపబడినవి. ఈ ౨౪ ప్రశ్నలు శ్రౌతసూత్రమను ప్రసిద్ధితో నున్నవి. ౨౫, ౨౬ ప్రశ్నలలో గృహ్యకర్మలలో నుపయోగించుమంత్రములన్నియు ఋగ్యజుస్సామాథర్వణ వేదములలోనుండి సంగ్రహించి ఆపస్తంబుడు తా నేక మమున గృహ్యకర్మలను బోధింపదలచెనో ఆక్రమమున ఆ యా కర్మోపయోగిమంత్రములను కూర్చెను. ఇవియే మంత్రప్రశ్నములను ప్రసిద్ధితో నున్నవి. ౨౭ వ ప్రశ్నలో గృహ్యకర్మల నన్నిటిని బోధించెను, ఇదియే గృహ్యసూత్ర మను ప్రసిద్ధితో నున్నది. ౨౮, ౨౯ ప్రశ్నలలో సర్వవర్ణాశ్రమ సామయాచారికధర్మముల నుపదేశించెను. ఇవియే ధర్మసూత్రములను ప్రసిద్ధితో నున్నవి. ౩౦ వ ప్రశ్నలో యాగశాలా ఇష్టకా చిత్యాదుల ప్రమాణాదికమును బోధించెను. ఇదియే శుల్బసూత్రమను ప్రసిద్ధితో నున్నది.

ఇందు శ్రౌతసూత్రములలో నెచటను దేవ, పితృ, భూత మనుష్యయజ్ఞముల ప్రస్తావన చేయలేదు. ఆ పైగ్రంథమందు చేసెను. దానంజేసి త్రేతాగ్నులు గల ఆహితాగ్నిగూడ వీటిని గృహ్యాగ్నియందే చేయవలయునని ఆపస్తంబుల ఆశయము. అందుచే అగ్న్యాధానమే శాస్త్రీయమనియు సర్వాధానము అశాస్త్రీయమనియు ఆపస్తంబుల యభిమతముగా తెలియనగును.

వీరి ధర్మసూత్రములందు ప్రథమప్రశ్నలో ౧౧ ఖండములలో బ్రహ్మచారిధర్మముల నుపదేశించి ౧౨ వ ఖండమును

“తపస్స్వాధ్యాయః” అను సూత్రముతో నుపక్రమించి వేదమును బహుజాగ్రతతో మరవకుండ నధ్యయనము చేయుచుండుటయే తపస్సనబడుననియు మరచినచో బ్రహ్మోజ్ఝదోషమువచ్చుననియు బోధించి—

“అథ బ్రాహ్మణోక్తా విధయః తేషాం మహాయజ్ఞా సత్రాణీతిచ సంస్థితిః అహరహర్భూతబలిః మనుష్యేభ్యో యథాశక్తిదానం” అను సూత్రములతో ద్వాదశఖండమును ముగించి—

“దేవేభ్యస్స్వాహాకార ఆకాష్ఠాత్ పితృభ్యస్స్వధాకార ఓదపాత్రాత్ స్వాధ్యాయ ఇతి” అను సూత్రముతో త్రయోదశఖండమును ప్రారంభించి ఈ భూత, మనుష్య, దేవ, పితృయజ్ఞములు నాలుగునున్నా, స్వాధ్యాయమును తపస్సేయనిబోధించెను. అంతేగాని అచట ఆ యజ్ఞములకు వలయు మంత్రములనుగాని అనుష్ఠానాదీతి కర్తవ్యతా ప్రకారమునుగాని బోధింపలేదు.

స్వాధ్యాయబ్రాహ్మణమందు దేవ, పితృ, భూత, మనుష్య యజ్ఞములను క్రమముతో పఠింపబడియుండ వీరీ సూత్రములందు భూత, మనుష్య, దేవ, పితృయజ్ఞములను క్రమమును పఠించెను.

ఇక వీరి మంత్రపన్నములలో, మొదటిప్రశ్న ఇట్లుపక్రమింపబడియున్నది.

“1. అగ్నయే స్వాహా, 2. విశ్వేభ్యో దేవేభ్యస్స్వాహా
3. ధ్రువాయ భూమాయ స్వాహా, 4. ధ్రువక్షితయే స్వాహా
5. అచ్యుతక్షితయే స్వాహా, 6. అగ్నయే స్విష్టకృతేస్వాహా
7. ధర్మాయస్వాహా, 8. అధర్మాయస్వాహా, 9. అద్భ్యస్స్వాహా

10. ఓషధి వనస్పతిభ్యస్స్వాహా, 11. రక్షో దేవజనేభ్య
12. గృహ్యాభ్య స్స్వాహా, 13. అవసానేభ్య స
14. అవసానపతిభ్య స్స్వాహా, 15. సర్వభూతేభ్య
16. కామాయస్వాహా, 17. అంతరిక్షాయ స్వాహా, 1
జతి జగతి యచ్చచేష్టతి నామ్నో భాగోయన్నామ్నే
19. పృథివ్యై స్వాహా, 20. అంతరిక్షాయ స్వాహా, 2
స్వాహా, 22. సూర్యాయ స్వాహా, 23. చంద్రమసే
24. నక్షత్రేభ్యస్స్వాహా, 25. ఇంద్రాయస్వాహా, 26
స్పతయే స్వాహా, 27. ప్రజాపతయే స్వాహా, 28. ప్ర
స్వాహా, 29. స్వధాపితృభ్యస్స్వాహా, 30. నమో రు
పశుపతయే స్వాహా, 31. యేభూతాః ప్రచరంతి
మిచ్ఛంతో విబుదస్య ప్రేష్యాః తేభ్యో బలిం పుష్టికా
రామిమయి పుష్టిం పుష్టిపతిర్దధాతు స్వాహా ప్రసుగ్మం
సానస్య... అని.

ఇందు 'ప్రసుగ్మంతా' మొదలగునవి వివాహావ
లని వీరి గృహ్యసూత్రమువలన తెలియవచ్చుచున్నది.—
ఈ ప్రశ్నారంభమునుండి 31 మంత్రములు ఒకే కర్మక
ధించినవని తెలియుచున్నది. ఈ 31 మంత్రములలో
యెనిమిది దేవతాలింగకమంత్రములును ఒకటి పితృలింగక
మును రెండు భూతలింగకమంత్రములునుగా కనుపించు
మనుష్యులలో నుత్తముడగు వేదవిద్బ్రాహ్మణుడు సర్వ
రూపుడని 'యావతీర్వై దేవతాస్తా స్సర్వా వేదవిది బ్ర
వసంతి' యను శ్రుతి బోధించుచున్నందున మనుష
మంత్రములుగూడ ఇందున్నట్లు భావింపనగును,

యతిబ్రహ్మచారులేనని "యతిబ్రహ్మచారిణో భిక్షుకాః" యను ప్రమాణముచే దెలియవచ్చుచున్నది.

ఇక వీరి ధర్మసూత్రములలో బ్రహ్మచారి ధర్మప్రకరణమందు ౧-౩-౨౫ "సర్వం లాభమాహరన్గురవే సాయంప్రాతరమత్రేణ భిక్షాచర్యం చరేత్ గృహస్థేభ్యః అన్యత్రాపాత్రేభ్యః అభిశస్తాచ్చ" యను సూత్రముచే బ్రహ్మచారి సాయంప్రాతః కాలద్వయమందు పతితుడుగాని స్వధర్మనిష్ఠుడగు గృహస్థునివద్ద భిక్షను తెచ్చుకొని గురువుకు నివేదించి భుజింపవలెనని విధించెను. ఈ సూత్రమందలి అపాత్రశబ్దము నాతడిట్లు వివరించుచున్నాడు. "యస్యచాగ్నౌ న హూయతే నతద్భోక్తవ్యం" ౨-౬-౮ అనగా సమంత్రకముగా నెవని యన్నము అగ్నియందు హోమముచేయబడదో చకారముచే బలిహరణ మెవడాచరింపడో వాని యన్నమును భుజింపగూడదని శాసించెను.

ఇట్లే సన్న్యాసధర్మప్రకరణమందు "గ్రామే గృహస్థేభ్యః ప్రాణవృత్తిం ప్రతిలభ్య అనిహోఽనముత్రశ్చరేత్" ౨-౯-౧౦ అను సూత్రముచే స్వధర్మనిష్ఠుడగు గృహస్థులవల్ల యతి ప్రాణవృత్తిని పొందవలెనని బోధించెను.

మరియు గృహస్థు అగ్నిహోత్రమునుగాని అతిథులనుగాని భిక్షార్థినిగాని, విద్యార్థినిగాని ప్రత్యాఖ్యానము చేయగూడదని "అగ్నిహోత్రమతిథయో యచ్చాన్యదేవం యుక్తమధ్యయనార్థేన యం చోదయేన్నైనాన్ప్రత్యాచక్షీత" ౧-౧౪ అను సూత్రముచే బోధించెను.

ఇక నతిథిలక్షణములను ౨-౬-౩ "అగ్నిరివజ్వలన్నతిథి రభ్యాగచ్ఛతి ధర్మేణ వేదానాం శాఖామధీత్య శ్రోత్రియో భవతి స్వధర్మయుక్తం కుటుంబిన మభ్యాగచ్ఛతి ధర్మపురస్కారో నాన్యప్రయోజనః సోఽతిథిర్భవతి తస్యపూజాయాం శాంతి స్స్వర్గశ్చ" అను నాలుగుసూత్రములచే చెప్పి యేడవ సూత్రము మొదలు ఇరువదవసూత్రమువరకు "తమభిముఖో భ్యాగమ్య" ఇత్యాదిగా అతిథిపూజావిధానము నుపదేశించి "స ఏష ప్రాజాపత్యః కుటుంబినో యజ్ఞో నిత్యప్రతతః" అను సూత్రముచే నీ అతిథిపూజయే ప్రజాపతిదేవతాక మగుయజ్ఞ మనియు తాను భుజించు రెండుకాలములందును చేయదగిన దనియు బోధించి "ఊర్జం పుష్టిం ప్రజాం పశూ నిష్టాపూర్త మితి గృహస్థస్యాశ్నాతి యః పూర్వోఽతిథేరశ్నాతి" ౨-౬-౧౩ అనుసూత్రముచే అతిథికంటె ముందు భుజించుటలో దోష మును చెప్పెను.

ఇట్లు శ్రేష్ఠుడగు నతిథికి పూజాపురస్సరముగా భోజ నము పెట్టుమని చెప్పి "షడంగో వేదః అంగానాంతు ప్రధాన వ్యపదేశ ఇతి న్యాయవిత్సమయః" ఇత్యాది సూత్రములచే వేదవేదాంగముల నధ్యయనముచేసినవాడే బ్రాహ్మణశబ్దవాచ్యు డని చెప్పి "నబహిర్వేదే గతిర్విద్యతే" అనుసూత్రముచే వేదవేదాంగాతిరిక్తములగు తర్కాలంకార కావ్యనాటకాదులను పఠించువానికి వృథాయుర్దాయక్షపణముకంటె వేఱుప్రయోజన మెంతమాత్రము లేదని బోధించి, "బ్రాహ్మణాయానధీయా నాయ ఉదకమన్నమితి దేయం నప్రత్యుత్తిష్ఠేత్ నాభివాద

కాని ఈమంత్రక్రమము స్వాధ్యాయబ్రాహ్మణోక్తక్రమము తోడను ఈ ధర్మసూత్రోక్తక్రమముతోడను నుండక వ్యతిషంగ ముతో కూడుకొనియున్నది. దానంజేసి ఈ నాలుగుయజ్ఞములు అత్యంత విలక్షణములుగాక తంత్రానుష్ఠేయములనియు సమాన ద్రవ్యము గలవి యనియు ఆపస్తంబుని అభిప్రాయమైనట్లు సులభముగా గ్రహింపవచ్చును.

అట్లైన నీ మంత్రములతో చేయు కర్మకు సంకల్ప హవిర్నిర్వాపప్రోక్షణాదులందు ఈ నాలుగుయజ్ఞముల పేర్లను చెప్పవలయునా ? లేక ఈ నాల్గింటికి సమష్టినామధేయ మేమైన కలదా యను నాశంక గలుగ గృహ్యసూత్రమందలి 'వైశ్వదేవే విశ్వేదేవాః' 3–8–22 అను సూత్రములచే ఈ 31 మంత్రములతో చేయు కర్మవిశేషమునకు 'వైశ్వదేవ' మను కర్మనామధేయమని బోధించెను.

ఇక ఇది ఎప్పుడాచరింపవలెను– రోజుకొకపర్యాయమా? రెండుపర్యాయములా ? యనునదియు దీని ప్రయోజనమును గూర్చియు ఆపస్తంబుని యభిమతము నొకింత విమర్శించి తెలిసి కొందము.

ధర్మసూత్రములందు గృహస్థు ధర్మప్రకరణమందు— "అథాప్యుదాహరంతి యథామాతరమాశ్రిత్య సర్వేజీవంతి జంతవః । ఏవం గృహస్థమాశ్రిత్య సర్వేజీవంతి భిక్షవః" అనుటచే పిల్లలను పోషించుభారము తల్లిపైనున్నట్లు భిక్షుకులను పోషించు భారము ప్రతిగృహస్థుపై గలదని చెప్పెను. ఇట భిక్షుకులనగా

యాత ౨-౧౪-౧౬. ఇత్యాది సూత్రములచే లేదా వేదాంగ
ముల నధ్యయనముచేయుని సామాన్యబ్రాహ్మణునకు పూజా
రహితముగా భోజనముమాత్రమే పెట్టుమని చెప్పెను.

ఇట్లు గృహస్థునకు ౧. యతి బ్రహ్మచారులకు భిక్ష
పెట్టుట, ౨. గృహస్థుల కాతిథ్యమిచ్చుట యను రెండు ధర్మము
లవశ్యాచరణీయములుకాగా నీ రెండును ఒకమారే ఆచరిం
వలెనా? లేక ఏది ముందు నాచరింపబడవలెను? అను నాశంక
కలుగ నీ భిక్షకు 'అగ్రం' యను అన్వర్థసంజ్ఞను ఆపస్తంబుడ
స్మరించుటచే నీ భిక్షయే ప్రథమకర్తవ్యమని శాసించినట్లు
చెప్పవలయును. ఇంతేగాక భిక్షార్థి వచ్చునప్పటికి వైశ్వదేవమ
కాకున్నను వైశ్వదేవార్థము నిర్దేశించి ముందు భిక్షపెట్టింపుమ
"యది వైశ్వదేవాత్ప్రాగ్భిక్షార్థ్యాగచ్ఛేత ఉద్ధృత్య వైశ
దేవార్థం భిక్షాం దద్యాత్" అని బోధించి అందులకు కా
ణము నిట్లు పేర్కొనెను. 'హేమేత్రబ్రహ్మ' యనగా య
వేదాంతవిచారణమందును బ్రహ్మచారి వేదాధ్యయనమందును
నిరంతరవ్యాపృతులు గాన నీ గృహస్థు వారలను నిల్పినచో
వారి కాలము వ్యర్థమై 'బ్రహ్మకు' లోపము గల్గుననియు
అందులకీగృహస్థు నిమిత్తమగుననియు బోధించెను.

ఇక అతిథి ఎవరి ఆతిథ్యమును స్వీకరింపవచ్చును? ఎ
రిది స్వీకరింపగూడదు? అను విషయమున 'యస్యచాగ్
నహూయతే యస్యచాగ్రం నదీయతే నతద్భోక్తవ్యం
౨-౬-౪౨ అను సూత్రముచే ఎవనియన్న మగ్నియం
హోమముచేయబడదో చకారమువలన ఎవనియన్నము ఓ

హారణార్థముప యోగింపబడదో యెవనిచే యతిబ్రహ్మచారు లకు భిక్ష పెట్టబడదో వాని యన్నమును అతిథి భుజింపకూడ దనెను.

మరియు గృహస్థు తనకొరకు అన్నమును వండుకొన గూడదని 'నాత్మార్థ మన్నం పాచయేత్' ౨-౪-౪ అని బోధించి 'పాణిగ్రహణా దధిగృహమేధినోర్వ్రతం । కాలయో ర్భోజనం । అతృప్తిశ్చాన్నస్య' ౨-౧-౧ అను సూత్రములచే పర్వేతరకాలమందు సాయం ప్రాతఃకాలద్వయమందు తృప్తి లేని భోజనముచేయుమనియు పర్వములగు దర్శ పూర్ణమాస లందుమాత్రము ఉపవాసము చేయుమనియు బోధించి 'ఔపవస్త మేవ కాలాంతరే భోజనం' అను సూత్రముచే పర్వములందు ఒకమారు తృప్తిగా భుజించుటయే నుపవాసమనబడునని చెప్పి 'నేమం లౌకికమర్థం పురస్కృత్యధర్మాంచ రేయుః । తద్యథా ఆమ్రేఫలార్థేనిర్మితే ఛాయాగంధావనూత్పద్యేతే' ౧-౭-౧ ఇత్యాది సూత్రములచే గృహస్థులు సాయం ప్రాతఃకాలద్వయ మందు తమకున్నవారలకొరకు ఇంటియందు వంటచేసికొన గూడదనియు భిక్షాతిథ్యార్థమై వంటచేసి తద్వినియోగమైన పిమ్మట గృహమందలి బంధువులలో గర్భిణీస్త్రీలు మొదలగు వారికి భోజనముపెట్టి మిగిలిన శేషమును యజమానులగు దంప తులు భుజింపవలెననియు అట్లైనచో ఫలార్థనిర్మితమగు మామిడి చెట్టువలన ఛాయాగంధాది ప్రయోజనము లానుషంగికము లైనట్లు భిక్షాతిథ్యార్థమై వండినవంటవలన తమకున్నవారణ గూడ అనుషంగికముగా నగునని బోధించెను.

దీనివల్ల సాయం ప్రాతఃకాలద్వయమందు భిక్షాతిథ్యార్థమై వండిన అన్నమును సంస్కరించి భిక్షాతిథ్యాది దానయోగ్యత నొందించుట కేర్పడినదే ఈ 'వైశ్వదేవ' మనియు ఇట్టి అన్నమే 'అన్నేన ప్రాణాః... ఆత్మానం వేదయతి' యను శ్రుతిలో నభిప్రేతముగుచూ ఆత్మవిజ్ఞానమునకు సాధనమగుననియు నీ 'వైశ్వదేవ' మనునది సమప్రధానమగు హోమబలిక్రియాత్మకమనియు తేలినది. కావుననే సమిష్టి కుటుంబమందు ఏకపాకమై యుండుటచే భిక్షాతిథ్యాదులకు నన్నము సమానమే యగుటచేతను కుటుంబగత పురుషులకు భిన్నభిన్న వైశ్వదేవము లెంతమాత్రము శాస్త్రీయములుగావనియు 'సాయం యావాణాశ్చ వైశ్వదేవాః ప్రాతర్యావాణశ్చాగ్నిహోత్రిణో గృహమాగచ్ఛంతి' యను శ్రుతిలోని దేవతలు భిక్షుకాతిథులేననియు ఈ వైశ్వదేవము అగ్నిహోత్రకాలమందు 'సజూర్దేవైస్సాయం (ప్రాతః) యావభిః' అను మంత్రముతో వ్రీహ్యాదుల నభిమర్శించుటతోనే ప్రారంభమగుననియు ఆవ్రీహ్యాదులే నీ వైశ్వదేవమందు ద్రవ్యమనియు దర్శపూర్ణిమాద్యాత్రులందు వైశ్వదేవము లోపించుననియు ఎఱుంగవలయును.

ఈ వైశ్వదేవమందు ౩౧ మంత్రము లుండుటచేతను ప్రతి మంత్రములోను దేవత వేరువేరుగా నుండుటచేతను ఇందులో నేవి ప్రధానదేవతలు ఏవి అంగదేవతలు అను నాశంకగలుగును. అట్లే ముందు నీ వైశ్వదేవవిశేషమును బోధించుటలో కొన్ని మంత్రములతో నగ్నియందు హోమమును, మఱి కొన్ని మంత్రములతో బలిహరణమున్ను విధింపబడియున్నది.

అందు హోమము ప్రధానమై బలిహరణమందులకంగమగునా? లేక బలిహరణముప్రధానమై హోమమందులకంగమగునా? లేక హోమబలిహరణములు రెండును సమప్రధానములగునా యను నా శంకల నీ గృహ్యసూత్రము వారించుచున్నది. 'వైశ్వదేవే విశ్వేదేవాః' ౩-౨-౩౨ అని.

ఈ సూత్రార్థమవగతమగుటకు ఆ ప్రకరణసందర్భము నొకింత విమర్శింతము. వివాహమందు చేయు ఆగ్నేయస్థాలీపాకమును "అథనామాగ్నేయేన స్థాలీపాకేన యాజయతి" యను సూత్రముతో నీఖండ ప్రారంభింపబడి, 'తస్మా ఋషభం దదాతి' అను ౧౬ వ సూత్రముతో ముగింపబడి "ఏవమత ఊర్ధ్వం దక్షిణాపర్ణముపోషితాభ్యాం పర్వసు కార్యః" అను సూత్రముచే యావజ్జీవము ప్రతిపర్వమందును ఈ స్థాలీపాకము విధింపబడి 'పార్వణేనాతోన్యాని కర్మాణి వ్యాఖ్యాతాని' అను సూత్రముచే పర్వమందు చేయదగిన పై ఆగ్నేయస్థాలీపాక ప్రక్రియచేతనే మిగిలిన పాకయజ్ఞములన్నిటియొక్క ప్రక్రియ తెలియదగినదని బోధింపబడెను. అనగా సమస్తేష్టులకు దర్శపూర్ణమాసలు ప్రకృతియైనట్లును అట్లే సమస్త సౌమికయాగములకును నిరూఢపశుబంధము ప్రకృతియైనట్లును సమస్తపాక యజ్ఞములకున్ను ఈ పార్వణ స్థాలీపాకము ప్రకృతి యని యభిప్రాయము.

అట్టిన ప్రకృతిలో ౧. అగ్నిః ౨. స్విష్టకృత్తులను నిద్దరే ప్రధానదేవతలుగదా. ఆయా పాకయజ్ఞములలో దేవత లెవరు? అను నాశంక గలుగ 'యథోపదేశం దేవతాః'

యను స్మార్తముచే నాయాపాకయజ్ఞములందు ప్రధానదే
లను మాత్రము అచట చెప్పినట్లు గ్రహింపవలయునని బోధి
నాయా ప్రధానదేవతల నచట యోజింపవలయునను నాశ
గలుగ 'అగ్నిం స్విష్టకృతంచాంతరేణ' యను సూత్రము
ప్రకృతిలోనున్న రెండు దేవతలమధ్య నాయాపాకయజ్ఞ ప్రధా
దేవతలను యోజనచేయవలయునని సామాన్యాతిదేశము :
ఆపైని ఈ 'వైశ్వదేవే విశ్వేదేవాః' అను సూత్రము
స్మరించుటంజేసి ఆ సామాన్యాతిదేశమున కిది అపవాద
సూచకమానదు.

ఎట్లనగా మంత్రప్రశ్నలోని ౩౧ మంత్రములలో స్వి
కృన్మంత్రము నారవదిగా బరగుచున్నందున పై సామాన్యా
దేశముచే మొదటి యారుమంత్రములకు మాత్రమే ప్రధా
నతయు మిగిలిన ౨౫ మంత్రములకు అంగత్వమును ప్రాప్తి
చును. అట్లైన 'షడ్భిరాద్యైః ప్రతిమంత్రం హస్తేన జుహు
యాత్' - 'బలీనాంతస్యతస్య దేశే సంస్కారః' - 'స
మాప్తమాభ్యాముదగపవర్గ' ఇత్యాది సూత్రములచే మొద
యారుమంత్రములచే నగ్నియందు హోమమును మిగిలిన ౨
మంత్రములచే నాయాస్థానములందు బలిహరణమున్ను విధిం
బడుటంజేసి హోమము ప్రధానమున్ను బలిహరణమప్రధా
మున్ను అగును, మొదటి యారుమంత్రములు కేవల దేవత
లింగకములేగాని పితృ, భూత, లింగకము లెంతమాత్రమ
కావు. కావున దేవయజ్ఞ మొక్కటియే వైశ్వదేవమందు
ప్రధానమున్ను పితృ, భూత, మనుష్యయజ్ఞములు అప్రధా

నములున్నూ అగును. అట్లనచో మీమాంసాశాస్త్రమందలి ౧-౪-౧౧ అధికరణముచే 'ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతి.... ద్యావాపృథివ్యమేక కపాలం' యను శ్రుతిస్యుక్తములగు సమప్రధానతగల యీయిదియాగముల సమష్టికి వైశ్వదేవమను కర్మ నామధేయమను న్యాయముచే ప్రకృతమందు గూడ 'వైశ్వదేవ' మను కర్మనామధేయమే న్యాయ్యమగును.

కావున ఇట్టి మూలోచ్ఛేదకరమగు సస్థానసంశయము నివారించుటకై మీమాంసాకోవిదులగు శబరస్వాములు పైనానా న్యాతి దేశమున కపవాదముగా నీ 'వైశ్వదేవే విశ్వేదేవాః' యను సూత్రమును స్మరించిరి. ఇందువలన పై ౩౧ మంత్రములలోని దేవతలున్నూ ప్రధానదేవతలై ఆ ౩౧ మంత్రములతో చేయు హోమ బలిహరణాత్మక క్రియాద్వయము వైశ్వదేవమను కర్మనామధేయ మగుచున్నది. ఇపుడు చాతుర్మాస్యాద్యపర్వమగు వైశ్వదేవమనుకర్మయందలి ఆగ్నేయాద్యష్టయాగములకు సమప్రాధాన్యత యున్నట్లే తుల్యన్యాయముచే ప్రకృతమునగూడ దేవ, పితృ, భూత, మనుష్యయజ్ఞములు సమప్రధానములై వైశ్వదేవశబ్దవాచ్యములగుచున్నవి. కావుననే దేవతార్చనలో మహానివేదన మనునది వైశ్వదేవానధికృతవిషయమనియు అధికారులకు వైశ్వదేవమే సర్వదేవతానివేదనమనియు గ్రహింపవలయును.

ఇట్లు హోమేతరకర్మగూడ ప్రధానమగుట ఇతరత్రగూడ కానవచ్చుచున్నది. ఎట్లన అగ్నిష్టోమమందు సోమక్రయణీయపదమందు హోమము ఉదకమందుఅవభృథ హోమము

అశ్వమేధయాగమందు మేధ్యాశ్వపదమందు హోమము-మాసిశ్రాద్ధమను పాకయజ్ఞమందు (బ్రాహ్మణభోజనము- సర్పబలి ఈశానబలియను రెండుపాకయజ్ఞములందు హోమ బలి హరణములు రెండును సమప్రధానములగుట ఇత్యాదులు.

ఇట్లాపస్తంబులు తమ ధర్మసూత్రమందు పరామర్శింపబడిన దేవాదియజ్ఞ చతుష్టయమునకు మంత్రప్రశ్నములో మంత్రముల నుపదేశించి గృహ్యసూత్రముచే నాసమూహమునకే వైశ్వదేవమను కర్మనామధేయమనియు గృహ్యాగ్నియందే యీహోమము చేయవలయుననియు హోమ, బలిహరణములకు సమప్రధానతయే యనియు బోధించి తత్ప్రయోగవిధి నిట్లు ధర్మసూత్రమందుపదేశించుచున్నారు.

ముందు వైశ్వదేవార్థమై పాక మెచట చేయవలయునను విషయము నిట్లు ‘ఔపాసనే పచనే వా’ యను సూత్రముచే బోధించెను. ఈ సూత్రార్థ మొకింత విమర్శింతము. వీరి ౨౪ వ ప్రశ్నలో పరిభాషల నుపదేశించు సందర్భమున యాగార్థం చరుపురోడాశహవిస్సులను లౌకికాగ్నియందు పచనము చేయగూడదని ‘యదగ్నౌ పచనం తస్మిన్నేవ హోమః’ యని స్మరించెను. పాకయజ్ఞము లన్నియు గృహ్యాగ్నిలోనే చేయదగినవని ‘యస్మిన్నగ్నౌ పాణిర్గృహీతః తస్మిన్నేవ పాకయజ్ఞాః’ అని స్మరించెను. ఇంతేగాక పార్వణాధర్మాతిదేశముచే గూడ గృహ్యాగ్నియే వైశ్వదేవహోమాధికరణమని సిద్ధముగుచుండ ఈ ‘ఔపాసనే పచనేవా’ యను సూత్రము హోమాధికరణముకొరకు స్మరించుట వ్యర్థముగదా. కావున

ఈ సూత్రము పచనక్రియాధికరణమును బోధించుట కేర్పడి నట్లు స్పష్టమగుచున్నది.

ఒకవేళ హోమాధికరణమును బోధించుట కేర్పడిన దని చెప్పినను 'సిద్ధే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి' యను న్యాయము ననుసరించి ఇది యొక యపూర్వమును నియమించవలెను. అదేదియన పచనక్రియ ఔపాసనాగ్ని యందే చేయవలెను. అట్లు చేయుట అసౌకర్యముగా నుండు నని నెవ్వరేని తలచునెడల నవ్వారలు ఈ ఔపాసనాగ్నిలో నుండి ఏకదేశమును గ్రహించి స్థానాంతరమందుంచి దానిపై పచనముచేయుచో నాపచనాగ్నికూడ ఔపనాగ్నితో సమాన మగును. కాన తచ్ఛ్రిపితపాకముకూడ హోమార్హ మగునను యపూర్వమును నియమించుచున్నట్లు ప్రాజ్ఞులు గ్రహింపగలరు. అపుడే ఔపాసనాగ్నియు, పచనాగ్నియు తుల్యబలము లగుటచే వికల్పార్థక వా శబ్దము పపన్నమగును.

కావున ప్రవాససమయమునందు విప్రుడు తానొక గృహస్థున కతిథిగానున్నప్పుడు వైశ్వదేవము ప్రసక్తముగాదు. ఏలయన పరకీయగృహమందలిపచనాగ్నికూడ నాతనిగృహ్యాగ్ని రూపమే గావున నాతని జాయాసంబద్ధమై యాతని యుపాస్య దేవతగా నొప్పుచున్నందున నట్టి పరకీయదేవతయందు హోమము చేయ నీతని కధికారము లేదుగదా. అట్లే హోమ ద్రవ్యముకూడ పరకీయమే యగుటచే నద్దానికి స్వకర్తృక హోమార్హత లేదు. కాంగా స్వదేవతోద్దేశ్యక స్వద్రవ్యత్యాగ

మాణ బలిహరణము చేయవలయునని బోధించెను. ఆపైసూత్రములచే ఆయాబలులకు స్థానములను మంత్రప్రశ్నలోని మంత్రక్రమముగా నిట్లు బోధించుచున్నారు.

1. అపరేణాగ్నిం సప్తమాష్టమాభ్యా ముదగపవర్గం (ధర్మాయ-అధర్మాయ) 2. ఉదధానసన్నిధౌ నవమేన (అద్భ్యః) 3. మధ్యే అగారస్య దశమైకాదశాభ్యాం ప్రాగపవర్గం (ఓషధి ...రక్షోదేవ), 4. ఉత్తరపూర్వదేశే అగారస్య ఉత్తరైశ్చతుర్భిః (గృహ్య, అవ, అవసానపతి, సర్వభూత), 5. శయ్యాదేశే కామలింగేన (కామాయ), 6. దేహళ్యామంతరిక్షలింగేన (అంతరిక్షాయ), 7. ఉత్తరేణాపిధాన్యాం (యదేజతి జగతి). 8. ఉత్తరైర్బ్రహ్మసదనే (పృథివ్యై... బ్రహ్మణే ౧౦ బలులు), 9. దక్షిణతః పితృలింగేన ప్రాచీనావీత్యవాచీనపాణిః (స్వధా), 10. రౌద్ర ఉత్తరః (నమో రుద్రాయ) అను పదిస్థానములందు ౨౮ మంత్రములతో ౨౮ బలులను విధించి వీటి సంస్కారము నిట్లుపదేశించుచున్నారు.

'బలీనాంతస్యతస్య దేశే సంస్కారః హస్తేనపరిమృజ్య అవోక్ష్యన్యస్య పశ్చాత్పరిషేచనం' అని సామాన్యవిధి బోధించి 'బలీనాం దేశే దేశే సమవేతానాం సకృత్సకృదంతే పరిషేచనం' అను విశేషవిధిని బోధించెను. ఇట్టి విశేషవిధిచే ఒకే స్థానమునందలి పితృ రౌద్రబలులకు సకృత్పరిషేచనము ప్రాప్తముకాగా 'అంత్యయోర్నానా పరిషేచనం ధర్మభేదాత్' అను సూత్రముచే పితృబలి కపసవ్యపరిషేచనమున్ను రౌద్రబలికి సవ్యపరిషేచనమున్ను అను ధర్మభేదము పరిభాషచే

సిద్ధించినందున ఇవి రెండును ఒకచోట వేయునవైనను సవ్యాప సవ్యపరిషేచనములతో సంస్కరింపబడవలెనని బోధించెను.

ఇట్లు మంత్రప్రశ్నలోని 31 మంత్రములలో 30 మంత్రములకు సాయం ప్రాతఃకాలద్వయము సాధారణవినియోగము నుపదేశించి మిగిలిన 31 వ మంత్రముతో 'నక్తమేకోత్తమేనవైహాయసం' అను సూత్రముచే రాత్రియందుమాత్రమే వైహాయసబలిని వేయవలెనని బోధించెను. ఆమంత్రమందలి 'యే భూతాః ప్రచరంతి నక్తంబలి మిచ్ఛంతః' యను లింగముచేతనే ఆ బలి రాత్రియందు చేయదగినట్లు గోచరించుచుండగా తిరిగి ఆపస్తంబులు ప్రత్యేకసూత్రముచే స్మరించుట ఎందులకు? అను విషయము నొకింత విమర్శింతము—

అగ్నిహోత్రప్రకరణమందలి 'సజూర్దేవైః' ఇత్యాది హవిర్నిర్దేశమున్ను 'సాయం యావానః' ఇత్యాది ఆతిథ్యవిధియు స్వాధ్యాయబ్రాహ్మణమందలి దేవాదియజ్ఞములున్ను 'అన్నేన ప్రాణాః... ఆత్మానం వేదయతి' అను ఆత్మజ్ఞానహేతుకమగు నన్నవిశేషవిధియు వీటి నన్నిటిని సమన్వయించి అనుష్ఠింపదగిన కర్మవిశేషమగు వైశ్వదేవమున్ను సర్వశాఖీయులచేతను అనుష్ఠింపదగినదై యున్నది.

శాఖాభేదముచే కర్మభేదముండునా? లేదా యను విషయము మీమాంసాశాస్త్రమందు 2-4-2 లో 2-8 సూత్రములతో పుష్కలమగు విచారణచేయబడి ఈ క్రింది సారాంశము నిర్ణయింపబడినది—

కర్మయన— 1. నామము (దర్శాది), 2. రూపము (ఆగ్నేయాది ప్రధానయాగత్రయాది), 3. అధికారి (ఆహితాగ్ని), 4. ప్రయోజనము (స్వర్గాది), 5. ఇతి కర్తవ్యత (సంకల్పాద్యవభృథాంతక్రియాకలాపము) యను నైదుయంశము లతోఁగూడిన క్రియావిశేషము. అందు ఇతి కర్తవ్యత ఎన్నిశాఖలలో ఎన్నిమార్పులతో నున్నను మిగిలిన నామ రూప అధికారి ప్రయోజనములు అను నాలుగంశములు ఎచటెచట సమానముగా నుండునో అచట కర్మైక్యమేగాని కర్మభేదము లేదు.' యని—

కాసంజేసి "న్యాయోపబృంహితాభ్యాం మంత్ర బ్రాహ్మణాభ్యాం' యను ప్రతిజ్ఞతో కల్పసూత్రరచన కుపక్రమించిన మీమాంసకాగ్రేసరులగు ఆపస్తంబులు ఇతరశాఖలలో 'దివాబలిమిచ్ఛంతః' యను పాఠములుండుటంజేసినట్లైవనైనను నాపాఠము నాశ్రయించి 'దివాబలిమిచ్ఛంతః' యని గాని—

'అగ్నయే జుష్టంనిర్వపామి' యను ప్రకృతిలోని మంత్రమును 'ఇంద్రాగ్నిభ్యాం జుష్టం నిర్వపామి' అని వికృతులలో చేయు శాస్త్రీయకమగు నూహవలె ఇందుగూడ 'దివా' యను నూహచేసి పఠించి పగటియందుగూడ వైహాయసబలి నాచరింతురేమోనను నభిప్రాయముతో గాని అద్దానిని వారింపనీ సూత్రమును స్మరించిరి.

మరియు నీ వైశ్వదేవమంత్రములు తైత్తిరీయశాఖలో రాజీవ ప్రశ్నలో పఠింపబడియున్నవి. ఇయ్యది శ్రీ విద్వా

రణ్యులకాలముననే అనేకదేశములలో అనేకపాఠభేదములతో నొప్పుచున్నట్లున్ను అన్నిపాఠములును ఆయాదేశీయ శిష్టసాంప్రదాయమంనవిచ్ఛిన్నముగా ప్రవర్తించుటంజేసి ప్రమాణములేర్పననియు విద్యారణ్యులు చెప్పి తాముమాత్రము పూర్వవృత్తికారులచే ననుసరింపబడినందున ద్రవిడపాఠమునకు వ్యాఖ్యానము చేయుచు నితరపాఠాంతరములను సూచింతుమనియు తదుపోద్ఘాతమందు వ్రాసిరి. అందు వారు ప్రదర్శించిన పాఠాంతరములలో నొకటి ౬౪ అనువాకములు గలది. రెండవది ౭౪ అనువాకములు కలది. మూడవది ౮౦ అనువాకములు గలది. నాలుగవది ౮౯ అనువాకములు గలది.

అందు విద్యారణ్యవ్యాఖ్యాతపాఠమందు ఈ వైశ్వదేవ మంత్రములలో నొకటియైనను గానరాదు. ఆంధ్రదేశమందు ప్రసిద్ధముగానున్న పాఠములలో నీ ఆపస్తంబపఠిత ౩౧ మంత్రములలో ౩౦ మంత్రములు అట్టిపాఠములోనే యుండి ౩౧ వ మంత్ర మిట్లున్నది. 'యే భూతాః ప్రచరంతిదివానక్తం బలిమిచ్ఛంతో...' యని — ఈ ౩౧ కాక మరి యేడు మంత్రములధికముగా నీయాంధ్రపాఠమందున్నవి. ఇట్టి పాఠభేదములు ఆపస్తంబునికాలమందుకూడ యుండియుండవచ్చును. లేనిచో సర్వదేశములందు ఏకరీతిగానే పాఠముండియున్నయెడల నాపస్తంబులు ఈ మంత్రములను పృథక్కుగా తన మంత్రప్రశ్నమందు పఠింప నవసరముండదని ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

కావున నట్టిపాఠాంతరములను స్వశాఖోక్తములుగదా యను తలంపుతో నెవరైనను అనుసరించి పఠించుటయందుకూడ

వైహాయసబలినిగాని ఈ ౩౧ కంటె ఇంకా అధికముగా బలులనుగాని చేతు రేమోయని నూహించి తద్వారణార్థ మీసూత్రమును స్మరించెనని కోవిదులు గ్రహింపగలరు. ఇందు 'ఉత్తమేన' యను పదముచే సీమంతిముతో బలిహరణము సమాప్తమగునను విశేషముకూడ భాసించుట. ప్రాజ్ఞుల కొక వింతగాదు.

అట్లుగాక ఈ సూత్రమందలి 'ఏన' కారమును భిన్నక్రమముగా యోజించి 'నక్తముత్తమేనైన' యను వైహాయసబలి యొక్కటే రాత్రియందు వైశ్వదేవమను నర్థముచెప్పినచో 'సాయం యావాణః .. ప్రాతర్యావాణః...తస్మాద్విరహ్నో మనుష్యాణాం సాయంచ ప్రాతశ్చ... సజూర్దేవైః ప్రాతర్యావభిః... సజూర్దేవైస్సాయం యావభిః... అగ్నిస ప్రాణాః... ఆత్మానం వేదయతి'— ఇత్యాది పూర్వోదాహృత శ్రుతివిరోధమున్ను 'నాత్మార్థ మన్నం పాచయేత్ - బ్రహ్మచారీ సాయం ప్రాతర్భిక్షేత - యస్యాగ్నౌనక్రియతే యస్యాగ్రం నదీయతే నతద్భోక్తవ్యం'— ఇత్యాద్యాపస్తంబసూత్రవిరోధమున్ను గల్గును.

ఆపైని 'య ఏతానవ్యగ్రం యథోపదేశం కురుతే నిత్యస్స్వర్గః పుష్టిశ్చ' యను ఫలశ్రుతితో నుపసంహరించెను. ఈ బలిహరణాంతమందు వినబడు ఫలశ్రుతి కేవల బలిహరణాత్మకమగు వైశ్వదేవమునకే యను సందేహముకలుగ నద్దానిని 'గృహమేధినో యదశనీయస్య హోమాబలయశ్చ స్వర్గపుష్టిసంయుక్తాః' యను సూత్రము వారించి మొత్తము వైశ్వదేవమునకే యీఫలమని బోధించుట యేగాక నీ వైశ్వదేవఫలము

స్వర్గాదికముగూడ నగునని బోధించుచున్నారు. లోగడ 'యస్యాగ్నౌ నహూయతే నతద్భోక్తవ్యం' మొదలగు సూత్రములచే అన్నసంస్కారార్థత నుపదేశించెనుగదా.

ఆ యభిప్రాయమునే దిగున 'అగ్రించదేయం' అను సూత్రము స్పష్టపరచుచున్నది. అనగా నిపుడు అన్నమునకు భిక్షాతిథ్యాది దానయోగ్యత పట్టినదని యభిప్రాయము. ఇచట అగ్రదానమున కెట్టి మంత్రమును బోధింపలేదు. దానం జేసి అగ్రదానమనునది యతిబ్రహ్మచారులకు అమంత్రకముగా భిక్షపెట్టుటయే యనిఁయు స్వేచ్ఛాకల్పితమంత్రములో అగ్ని యందు హోమముచేయుట అశాస్త్రీయమనియు ప్రాజ్ఞులు గ్రహింపగలరు. 'నిమిత్తాభావే నైమిత్తికాభావః' యను న్యాయముచే యతిబ్రహ్మచారులు లభ్యముకానపుడు ఈ అగ్రిదానము లోపించును.

అనంతరకర్తవ్యమును 'అతిథీనేవాగ్రేభోజయేత్ బాలా స్వవృద్ధాన్రాగసంబంధాన్ స్త్రీశ్చాంతర్వత్నీః' యనియుపదేశించెను. ఇందొక విశేషము గలదు. వైశ్వదేవ ద్రవ్యము అన్న సూప ఘృతములు మాత్రమే యగుచు 'హవిష్య' మను నన్వర్థసంజ్ఞతో నొప్పుచున్నది. అతిథుల నట్టి హవిష్యము తోనేగాక యదనవుద్రవ్యముతోగూడ భుజింపజేయవలయునని 'సాంత్వయిత్వా తర్పయేద్రసైర్భక్ష్యైః... యచ్చాస్య మనసో భీప్సితం వదతి' యను సూత్రముచే బోధించెను. కాని ఆఅతిథి కోరినశాకాదికము అహవిష్యమగుటంజేసిఅగ్నిలో హోమము చేయ ననర్హమగును. అగ్నిలో హోమము చేయబడనిచో

అతిథి సద్భావిని భుజింపఁగూడదు. అట్టి సమస్య నూహించి ఇట్లు పరిహరించుచున్నారు. 'అహావిష్యస్య హోమః ఉదీచీనముష్ణం భస్మాపోహ్య తస్మిన్జుహుయాత్ తద్ధుతమహుతం చాగ్నౌ భవతి' అను సూత్రముచే అహావిష్యమగు శాకాదికము సమంత్రక ముగా భస్మమందు వేయఁదగును. గాన స్వేచ్ఛాపరికల్పిత మంత్రములతో నీ హోమ మొనర్చుట యశాస్త్రీయమగు చున్నది.

ఇట్లు అతిధ్యాపులనుత్పత్తి నొందించి పిమ్మట కర్తవ్యము నిట్లుపదేశించుచున్నారు. ' అంతే యజమానాశ్నతః - అథ అమత్రేభ్యో లేపాన్నం కృష్య అద్భిస్సంసృజ్య ఉత్తరత శ్శుచౌ దేశే రుద్రాయనినయేత్ ఏవం వాస్తు శివం భవతి ' యని.

ఇట్లు ' సజూర్దేవైః ' యను మంత్రముతో సగ్నిహోత్ర కాలమందు హవిర్నిర్దేశముతో నారంభము చేయబడిన ఈ వైశ్వ దేవము అమత్రలేపనముల నుత్తరదిక్కున రుద్రున కిచ్చుటతో ముగియుటచే నీ మధ్య పతితమగు కర్మయంతయు వైశ్వదేవ శబ్దవాచ్యమే గావున యజమాన తత్సంబంధి భోజనమంతయు గూడ నీ వైశ్వదేవమే యని గ్రహింపబడుచున్నది.

ఈ వైశ్వదేవమంత్రముల నధ్యయన మొనర్చి యనుష్ఠాన మును ప్రారంభించుటకు నియమముల నిట్లుపదేశించుచున్నారు. ' ఏతేషాం మంత్రాణా ముపయోగే ద్వాదశాహమధ శ్శయ్యా బ్రహ్మచర్యం క్షార లవణ వర్జనంచ ఉత్తమస్యైకరాత్ర ముపవాసః ' ౨-౩-౧౮ యని.

ఇక గృహయజమాని గ్రామాంతరగతుడైనపుడు భిక్షాతిథ్యాదుల నెట్లు చేయవలయుననగా ఉపనీతుడైన కుమారుడున్నచో వానిచే వైశ్వదేవమును చేయించి భిక్షాతిథ్యాదుల నీయవచ్చును. అట్లు లేనియెడల యజమానిపత్ని ఏమిచేయవలయునను విషయము నిట్లుపదేశించుచున్నారు. 'జాయాపత్యోర్నవిభాగో విద్యతే। పాణిగ్రహణాద్ధి సహత్వం కర్మసు। తథాపుణ్యఫలేషు। ద్రవ్యపరిగ్రహేషు చ। నహిభర్తుర్విప్రవాసే నైమిత్తికేదానే స్తేయముపదిశంతి। ... నస్త్రీజుహుయాత్। నానుపేతః' (౨-౬-౨౯ నుంచి పటలాంతం) అని.

దానంజేసి ప్రతివాడును ఉపనయనానంతరమే ఈ వైశ్వదేవమంత్రములను యథోచిత నియమపూర్వకముగా నధ్యయనముచేసి అనుష్ఠానార్హతను సంపాదించియుండితీరవలయుననియు అట్టివాడు తండ్రి ప్రవాసకాలమున మాత్రమే వైశ్వదేవ మొనర్పవలయుననియు తేలుచున్నది. అట్టి కుమారుడున్న లేనప్పుడు యజమాని పత్ని హోమరూపవైశ్వదేవ మొనర్పక 'యథోపదేశం కామ్యాని బలయశ్చ' గృహ్యే ౩-౮-౪ యను సూత్రానుసారముగ బలిహరణరూపవైశ్వదేవ మవశ్యమాచరించి భిక్షాతిథ్యముల నిచ్చితీరవలయును. పై సూత్రములో 'నస్త్రీజుహుయాత్' అనగా 'నేక్షేతోద్యంత మాదిత్యం' యనుచోట 'సంధ్యాముపాస్య' యను నర్థమువలె యజమానపత్ని హోమేతరబలిహరణాత్మక వైశ్వదేవ మొనర్పవలయునను యర్థమును ప్రాజ్ఞులు గ్రహింపగలరు. కావున 'నిమిత్తాభావే నైమిత్తికాభావః' యను మీమాంసా

న్యాయముచే అతిథి లభ్యముగానపుడు ఆతిథ్యము లోపించునే గాని స్వేచ్ఛాకల్పితమంత్రములచే నగ్నియందు హోమము చేయుట యశాస్త్రీయమని ప్రాజ్ఞులు గ్రహింపగలరు.

ఇక శ్రాద్ధదినమందు నైమిత్తికము నిత్యము బాధించును అను మీమాంసాన్యాయానుసారము నిత్యమగు వైశ్వదేవము అత్యంతము బాధింపబడుచుండ మనువుచే జేయబడిన

'ఉచ్ఛేషణంతు తత్తిష్ఠే ద్యావద్విప్రా విసర్జితాః।
తతో గృహబలిం కుర్యాదితి ధర్మో వ్యవస్థితః' ౩-౨౬౫.

అను ధర్మవ్యవస్థచే ఉచ్ఛేషణానంతరము బలిహరణరూప వైశ్వదేవముమాత్రము చేయదగినట్లు గ్రహింపవలెను.

ఇట్లాపస్తంబుని సూత్రపర్యాలోచనచే—

1. దేవయజ్ఞాది చతుష్టయమునకే వైశ్వదేవమను సంజ్ఞయని
2. సాయం ప్రాతఃకాలద్వయమం దనశ్యాచరణీయమనియు,
3. హోమ బలిహరణాత్మక సమప్రధానకర్మద్వయరూపమని
4. ఉపనీతమాత్రు డధికారియనియు,
5. అన్నసంస్కారద్వారా స్వర్గపుష్టిశాంతిఫలకమనియు,
6. యజమానప్రవాసమందు పత్ని బలిహరణమునుమాత్రమే చేయవలయుననియు,
7. సమిష్టికుటుంబమున ప్రధానయజమానికృతమే చాలుననియు
8. పరకీయగృహమందెట్టియగ్నియందును అతిథి, వైశ్వదేవము చేయగూడదనియు,
9. పూర్ణిమామావాస్యలందుమాత్రము రాత్రి వైశ్వదేవము లేదు.
10. భిక్షాతిథ్యార్థమైమాత్రమే గృహమందు పచనము చేయవలెను.

9. శ్రాద్ధదినమందు ఉచ్ఛేషణానంతరమున బలిహరణేతర వైశ్వదేవము కర్తవ్యమనియు తేలినది.

ఇట్లే నామ, రూప, అధికారి ప్రయోజనములను కర్మ యొక్క నాల్గుఅంశములలో కల్పసూత్రకారులందరును ఏకీభవించిరనియు ఒక్క ఇతి కర్తవ్యతాంశలోమాత్ర మాయాకల్ప సూత్రకారులు ఆయాశాఖాంతర బ్రాహ్మణానుసారముగా భిన్న రీతుల నుపదేశించిరనియు అట్టియెడ సర్వశాఖాకర్మైక్యమున కెంతమాత్రము నభ్యంతరము లేదని మీమాంసాశాస్త్రము ౨-౪-౨ న్యాయముచే బోధించినదనియు లోగడ చెప్పబడియె. అద్దాని నిక పరిశీలించిచూతము— ఇతి కర్తవ్యతాంశయనగా కొందరు సూత్రకారులు కొన్ని హోమములను, కొన్ని బలులను విధింప, మరికొందరు సూత్రకారులు మరికొన్ని హోమములను, మరికొన్ని బలులను విధించిరి. అంతియేగాని మిగిలిన సిద్ధాంత మంశములను సమానమే ననువిషయపరిశీలనములో ముందు బోధాయనుని రీతిని పరిశీలింతము—

బోధాయనకల్పము— వీరి గృహ్యసూత్రములందు ద్వితీయప్రశ్నలో అష్టమాధ్యాయమందు 'సాయం ప్రాతర్యదశనీయస్య క్రియేత... సర్వేష్వాయతనేషు పాణినా పరిసమూహ్య ఉభయతః పరిషేకం నిదధ్యాత్ ... అవగ్రాహశో హస్తేన హోమః' యను నెనిమిదిసూత్రములచే పైసిద్ధాంతమునే బోధించి ౯, ౧౦ సూత్రములచే ఆ గృహ్యాగ్నియందు చేయదగిన ౨౪ హోమమంత్రాదులను బోధించి ౧౧ నుంచి 32 వరకు గల ౨౨ సూత్రములచే ౨౨ స్థానములందు ౮౯

బలులకు మంత్రస్థానాదుల నుపదేశించి ౩౦ వ సూత్రమందు 'యేభూతాః ప్రచరంతి దివా' ఇత్యాదిగా పగటియందు వైహాయసబలిని విధించి ౩౧ వ సూత్రమందు 'యేభూతాః ప్రచరంతి నక్తం' ఇత్యాదిగా రాత్రియందు వైహాయసబలిని విధించి ౪౦ వ, సూత్రమగు 'సంక్షాళనం ప్రాగుదీచ్యాం నినయతి నమోరుద్రాయ భౌమాయ స్వాహేతి' తో అష్టమాధ్యాయమును ముగించి 'అథ వైశ్వదేవం హుత్వా అతిథిమాకాంక్షేద్గోదోహకాలమాత్రం అగ్రంచ దద్యాత్' అను సూత్రముతో నవమాధ్యాయము నుపక్రమించుటం చేసి అష్టమాధ్యాయమం దుపదేశింపబడిన హోమ, బలిహరణ ద్వయాత్మక కర్మవిశేషమునకు 'వైశ్వదేవ' మను సంజ్ఞయని చెప్పినట్లు స్పష్టమగుచున్నది.

ఆ పైని 'జఘనేన గార్హపత్యం ఔపాసనం వోపవిశ్య అధీహిభో' ఇత్యాది సూత్రజాలముచే బ్రహ్మయజ్ఞానుష్ఠాన ప్రకారత నుపదేశించి 'యదధీతే సబ్రహ్మయజ్ఞః యజ్జుహోతిసదేవయజ్ఞః యద్భూతేభ్యో బలిం హరతి సభూతయజ్ఞః। యద్బ్రాహ్మణేభ్యోన్నం దదాతి సమనుష్యయజ్ఞః' అను నారవసూత్రముచే వైశ్వదేవమన నీ దేవాదియజ్ఞసమూహమేయని బోధించి 'ప్రవాసే స్త్రీర్వా అనుపేతోవా గృహేష్వేతాన్బలీన్హారేత్' అను సూత్రముచే యజమాని ప్రవాసకాలమందు పత్నీ కర్తృక బలిహరణమును విధించి 'తేషాం గృహాణేతు ద్వాదశరాత్రమ క్షార లవణభోజన మథశ్శయ్యా బ్రహ్మచర్యం' అను నియమోపదేశముతో నవమాధ్యాయ

మును ముగించెను. కావున ఒక ఇతికర్తవ్యతలోతప్ప మిగిలిన విషయమంతయు ఆపస్తంబసిద్ధాంతమునే వీరుగూడ అనుసరించినట్లగుపడుచున్నది.

ఇక నాశ్వలాయనునిరీతిని పరిశీలింతము— 'అథ సాయం ప్రాతస్సిద్ధస్య హవిష్యస్యజుహుయాత్ అగ్నిహోత్ర దేవతాభ్య స్సోమాయ వనస్పతయే అగ్నీషోమాభ్యాం ఇంద్రాగ్నిభ్యాం ద్యావాపృథివీభ్యాం ధన్వంతరయే ఇంద్రాయ విశ్వేభ్యో దేవేభ్యః బ్రహ్మణే స్వాహేతి అథబలిహరణం ఏతాభ్యశ్చైవ దేవతాభ్యః అద్భ్యః ఓషధి వనస్పతిభ్యః గృహాయ గృహదేవతాభ్యః వాస్తుదేవతాభ్యః ఇంద్రాయ ఇంద్రపురుషేభ్యః యమాయ యమపురుషేభ్యః వరుణాయ వరుణపురుషేభ్యః సోమాయ సోమపురుషేభ్యః ఇతి ప్రతిదిశం. బ్రహ్మణే బ్రహ్మపురుషేభ్య ఇతి మధ్యే। విశ్వేభ్యో దేవేభ్యః సర్వేభ్యో భూతేభ్యో దివాచారిభ్య ఇతిదివా। నక్తంచారిభ్య ఇతి నక్తం। రక్షోభ్య ఇత్యుత్తరతః। స్వధా పితృభ్య ఇతి ప్రాచీనావీతీ। శేషం దక్షిణానినయేత్' అని చెప్పి రెండవఖండను ముగించెను. ఇందు సాయం ప్రాతఃకర్తవ్యతయు ఇతికర్తవ్యతయు ఉపదేశింపబడినది. వీరుగూడ వివాహప్రకరణమందు స్థాలీపాకానంతరమువ 'సర్వపాకయజ్ఞానామేతత్తంత్రం' అను సూత్రమును, బ్రహ్మచారిధర్మప్రకరణమందు 'సాయం ప్రాతర్భిక్షేత' యను సూత్రమును, అతిథ్యప్రకరణమందు 'యదగ్నౌ నహూయతే నతత్స్వకర్తవ్యం' అనుసూత్రమును తృతీయాధ్యాయమందు 'అథాతః పంచయజ్ఞాః దేవయజ్ఞో భూతయజ్ఞః పితృ

యః 'మనుష్యయజ్ఞ ఇతి తద్యదగ్నౌ జుహోతి సదేవయజ్ఞః తద్యద్బలిం కరోతి సభూతయజ్ఞః తద్యత్పితృభ్యో దదాతి సపితృయజ్ఞః యస్మనుష్యేభ్యో దదాతి సమనుష్యయజ్ఞః' అను సూత్రాదులను, పృథక్కుగా బ్రహ్మయజ్ఞమును, స్మరించుటచే ఒక ఇతికర్తవ్యత వినా మిగిలిన ఆపస్తంబులు చెప్పినవిషయములనే యథాతథముగా బోధించెనని తెలియుచున్నది.

ఇక కాత్యాయన కల్పసూత్రమును పరిశీలింతము. వీరు రెండవకాండలో యెనిమిదవ కండికలో సమావర్తన విధి నుపదేశించి తొమ్మిదవ కండికను "అథాతః పంచమహాయజ్ఞాః" అను సూత్రముతో నుపక్రమించి "వైశ్వదేవాదన్నాత్"ను సూత్రముచే దీనికీ వైశ్వదేవమను సంజ్ఞయని బోధించి ౫హోమములను, ౭ స్థానములందు ౨౧ బలులను విధించి "యథార్థం భిక్షుకానతిథీంశ్చ సంభజేరన్"– బాల జ్యేష్ఠాగృహ్యా యథార్హమశ్నీయుః పశ్చాద్గృహపతిః పత్నీచ– పాత్రం నిర్ణిజ్య ఉత్తరాపరస్యాం దిశి నినయేత్"– ఇత్యాదిసూత్రములను స్మరించుటం జేసి నొక్క– ఇతికర్తవ్యతతప్ప మిగిలిన విషయములన్నియు ఆపస్తంబుని రీతినే పోలియున్నట్లు తెలియుచున్నది.

ఇట్లే వారాహగృహ్యసూత్రమందు ౨౦వ ఖండలో "అథాతః పంచమహాయజ్ఞాన్వ్యాఖ్యాస్యామః. సాయం ప్రాతస్సిద్ధస్య హవిష్యస్య వైశ్వదేవః"– ఇత్యాదిగా దేవయజ్ఞాదులకే వైశ్వదేవ సంజ్ఞను, సాయంప్రాతః కాలద్వయ కర్తవ్యతను, ఉపదేశించి గృహ్యాగ్నియందేడు హోమములను ౧౧ స్థానములలో ౨౭ బలులనువిధించి "భిక్షాంప్రదాయ అతిథీన్భోజయిత్వా"

ఇత్యాదిసూత్రములచే భిక్షాతిథ్యములను విధించెను. వీరి రీతి గూడ ఇతికర్తవ్య తేతరమంతయు ఆపస్తంబుని రీతిని పోలియే యున్నది.

ఇక ఖాదిర గృహ్యసూత్రమందు ప్రథమపటల పంచమ కండికలో "సిద్ధేసాయంప్రాతః హావిష్యస్యాన్నస్య" ఇత్యాది సూత్రపర్యాలోచనచేతను రెండుహోమములు గృహ్యాగ్నియం దును స్థానములందు ౧౩ బలులను బోధించుట చేతను "అథా తః పంచమహాయజ్ఞాః" అనియుపక్రమించి బ్రహ్మయజ్ఞవిధిని మాత్రము ప్రత్యేకముగా నుపదేశించి "సంతిష్ఠతే వైశ్వదేవః" యని ఉపసంహరించుటచేతను "అగ్రంచ భిక్షవేదత్వా అతిథీ న్భోజయిత్వా శేషం భుంజీయాతాం యజమానౌ" అను సూత్రముల చేత భిక్షాతిథ్యములనిచ్చి యనంతరమందు యజ మానుల భోజనమును విధించుటచే వీరుగూడ ఇతికర్తవ్యతేతర విషయములందు ఆపస్తంబుని సిద్ధాంతమునే యనుసరించినట్లు స్ఫుటమగుచున్నది.

ఇక మనుస్మృతి ఏమిబోధించునో దిఙ్మాత్రముగా విమ ర్శింతము. అందు ౩ అధ్యాయము ౬౭ శ్లోకము—

"వైవాహికాగ్నౌ కుర్వీత గృహ్యం కర్మయథావిధి
పంచయజ్ఞవిధానంచపక్తించాన్వాహికీం గృహీ"

తో ప్రారంభమై "వైశ్వదేవంహినామైతత్సాయం ప్రాతర్విధీ యతే" యను ౧౨౧ శ్లోకముతో నుపసంహరింపబడిన మధ్య భాగమగు ౫౫ శ్లోకములీ వైశ్వదేవ ప్రకరణముగా బరగు చున్నవి.

మనువీకర్మను ఉపక్రమమందు పంచయజ్ఞశబ్దముతో ప్రారంభించి వైశ్వదేవ శబ్దముతో నుపసంహరించెను. ఈ మధ్య భాగమందలి ౮౩ వ శ్లోకమందు "వైశ్వదేవం ప్రతిద్విజం" యనియు ౮౪ వ శ్లోకమందు "వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేగ్నౌ విధిపూర్వకం" యనియు- ౧౦౮ వ శ్లోకమందు "వైశ్వదేవేతు నిర్వృత్తే" యనియు- మువ్మారు వైశ్వదేవశబ్దమున కభ్యాసము కనుపించుచున్నది. కావున దేవాదియజ్ఞసమూహమునకే వైశ్వదేవమను కర్మనామమని తాత్పర్యము "వైవాహికాగ్నౌ" యను ౬౭ వ శ్లోకముచే గృహ్యాగ్నియందే వైశ్వదేవార్థపాకమున్నూ హోమమున్నూ విధింపబడెను. ౬౮వ శ్లోకమందు పంచసూనములు ప్రతిగృహస్థునకు ఉండునని చెప్పి ౬౯ శ్లోకమందు తన్నిష్కృత్యర్థము, పంచయజ్ఞములు విధింపబడినవని చెప్పి ౭౦వ శ్లోకమందు పంచయజ్ఞ నిర్వచన మొనర్చి ౭౧వశ్లోకమందు తదనుష్ఠాతకు పంచసూనాదోషములుండవనియు ౭౨ వ శ్లోకమందు తదననుష్ఠాతృనిందనున్నూ బోధించెను.

యజ్ఞములనగా కేవలమగ్నియందు హోమ మొనర్చుట మాత్రమే యను లోకప్రసిద్ధి ననుసరించి ఈ వైశ్వదేవమందు బలిహరణ భిక్షాతిథ్యాదులున్నవే, ఇది ఎట్లు యజ్ఞమగునను సందేహమెవరికైనను కల్గునని యూహించి ౭౩, ౭౪ శ్లోకములందు అహుత, హుత, ప్రహుత, బ్రాహ్మ్యహుత, ప్రాశితములను యజ్ఞభేదములను సలక్షణముగా వివరించి ౭౫నుంచి ౮౦ వరకుగల ౬ శ్లోకములచే గృహస్థాశ్రమాతిశయములను బోధించి ౮౧నుంచి ౮౩వరకుగల ౩ శ్లోకములచే దేవాదియజ్ఞ చతుష్ట

యము నందలి దేవతలను చెప్పి ౧౪వ శ్లోకమందు ఈ యజ్ఞచతుష్టయమే "వైశ్వదేవ"మని బోధించి ౧౫నుంచి ౨౨ వరకు గల ౮ శ్లోకములచే నీ హోమ దేవతలను, బలిదేవతలను బలిస్థానములను చెప్పి ౨౩వ శ్లోకమందు ఇట్టి యనుష్ఠాతకు ఫలాతిశయములను చెప్పి ౨౪వ శ్లోకమందు భిక్షాతిథ్యములను విధించి ౨౫నుంచి ౧౦౦ వరకుగల ౭౬ శ్లోకములచే ఆతిథ్య ప్రాశస్త్యమును అతిథి లక్షణమును తత్ఫలమును తదకరణమందు దోషమును చెప్పి

"సాయంత్వన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలింహరేత్
వైశ్వదేవంహి నామైతత్సాయం ప్రాతర్విధీయతే"

యను ౧౦౧వ శ్లోకముతో నుపసంహరించెను.

ఇందు ప్రధాన సిద్ధాంతములన్నియు ఆపస్తంబాది మార్గములో నున్నవి. హోమ, బలి దేవతలు మాత్రము ఆశ్వలాయనునితో సమానముగా నున్నవి. వేదములలో ఋగ్వేదము ప్రథమ పరిగణితమై యజ్ఞములందు ఋత్విగ్వరణమందు ఋగ్వేదీయ ఋత్విక్కగు "హోతృ"నే ప్రథమమందు వరించుట "ఋగ్వేదేన హోతా కరోతి ప్రథమమేవ హోతారం వృణీతే" యను శ్రౌత సూత్రానుసారము శాస్త్రీయమైనందునయు, ఈ మనువు ఋగ్వేదీయ బలిదేవతలను స్మరించెనని మనమూహింపనగును.

కాని ౧౦౧ శ్లోకము పూర్వార్ధమునుబట్టి ఒక్క సాయం వైశ్వదేవ విషయములో మాత్రము మనువు సర్వగృహ్యసూత్రకారులతో భిన్నాభిప్రాయము గల్గియున్నట్లు ఆపాతతః భాసించు

చున్నది. కాని ఈ ప్రకరణమందు ౮౧నుంచి ౮౪ వరకు గల శ్లోకములచే దేవాది యజ్ఞసమూహమునకే వైశ్వదేవమను సంజ్ఞను విధించి ౧౨౧ వ శ్లోకోత్తరార్థముచే వైశ్వదేవశబ్దమున నువదించి సాయంప్రాతఃకాలద్వయ కర్తవ్యతారూప గుణమును విధించుటవల్ల ౧౨౧ వ శ్లోక పూర్వార్థమందలి "సాయం" యను పదమునకు సాయంకాలమనిగాక మరియొక యర్థమును చెప్పవలెను. లోకప్రసిద్ధిననుసరించి సూర్యాదర్శనకాలము సాయంశబ్దార్థముగదా. స్వధర్మ నిష్ఠుడై పంచయజ్ఞానుష్ఠాతయగు గృహస్థు సూర్యుడేయని స్వాధ్యాయబ్రాహ్మణము. పంచయజ్ఞాంతః పతిత బ్రహ్మయజ్ఞ ప్రకరణమం దిట్లుపదేశించుచున్నది. "మధ్యందినే ప్రబల మధీయీతాసౌఖలువావైష ఆదిత్యోయద్బ్రాహ్మణః తస్మాత్తర్హి తేక్ష్ణిష్ఠంతపతి" యని

కావున ప్రకృత సాయంశబ్దమునకు గృహయజమాని గృహమందుండక ప్రవాసమందున్నపుడు అను యర్థమును చెప్పుట యుక్తమగుచు సర్వగృహ్యసూత్రములతో నేకీభవించును. లేదా— వేదశాఖావిభాగము లేనికాలమునందలి మనువుయొక్క వచనము పై తీరునఁ బరగుచున్నను వేదశాఖావిభాగానంతరము ధర్మవ్యవస్థాపకులుగాఁ బరగిన యాపస్తంబాదుల వచనము వేదశాఖావిభాగానంతర కాలికులమగు మనకు పరమప్రమాణమగును. గావున నాయాశాఖీయులగు విప్రులు తమతమ కల్పసూత్రానుసార మనుష్ఠించిన నెట్టి ప్రమాణ విరోధమును గలుగ నేరదు. ఇద్దానిని మనువే తనశాస్త్రమును ముగించుచు నిట్లుపదేశించెను.

'ధర్మేణాధిగతో యైస్తు వేదస్సపరిబృంహణః
తేశిష్టా బ్రాహ్మణాజ్ఞేయాః శ్రుతి ప్రత్యక్ష హే
దశావరా వాపరిషద్యం ధర్మం పరికల్పయేత్
త్ర్యవరా వాపి వృత్తస్థా తం ధర్మం నవిచాలయే

కావున కాలానుసారము ఆపస్తంబాది వ
మనువచనమును పరిత్యజించినను నష్టమది యె
హేతు వెంతమాత్రము కానేరదని గ్రహింపవచ

ఇట్లు విమర్శించగా తేలిన సారాంశమేమ

1. దేవాదియజ్ఞచతుష్టయమునకే 'వైశ్వదేవ
2. సాయంప్రాతఃకాలద్వయమందు వైశ్వదేవ
3. పూర్ణిమామావాస్యలందుమాత్రము రాత్రి లేదు.
4. భిక్షాతిథ్యార్థమైమాత్రమే గృహమందు వ వలెను.
5. వైశ్వదేవమనునది అన్నమును సంస్కరించి దానయోగ్యతను గల్గించి తద్వారా స్వర్గ ఫలకము.
6. హోమ, బలిహరణ, భూత, సమప్రధాన త్మకము.
7. యజమాని ప్రవాసమందు ఉపనీతుడైన కుమ వచ్చును. లేనియెడల యజమానపత్ని బ రించి భిక్షాతిథ్యముల నిచ్చితీరవలెను.

8. ఉపనయనమగుటతోనే ద్వాదశాహ నియమపూర్వకముగ వైశ్వదేవమంత్రములను పఠించి తదనుష్ఠానయోగ్యతను ప్రతిద్విజుడు బడసియుండవలెను.

9. సమిష్టికుటుంబమందు యజమానుడొక్కరుడే వైశ్వదేవము నాచరింపవలయును గాని ఇతరులాచరింప నవసరము లేదు.

10. ప్రవాసమందు పరుల కతిథిగానుండునపుడు పరగృహమందు వైశ్వదేవ మొనరింపగూడదు.

11. మాతాపిత్రాదుల ప్రతి సాంవత్సరిక శ్రాద్ధదినములందు ఉచ్ఛేషణానంతరము బలిహరణరూప వైశ్వదేవముమాత్ర మాచరింపవలయును అని

ఇట్టి శ్రుతికల్పసూత్ర, మనుస్మృతుల ప్రమాణముచే ఏకరీతిగా నిర్ణయింపబడిన పైవిషయములకు విరుద్ధముగా పురాణశ్లోకములనుగాని వ్యాఖ్యాతృవచనములనుగాని గ్రహించి ప్రవర్తించువారలు

'యశ్శాస్త్రవిధీ ముత్సృజ్య వర్తతే కామచారతః
నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాంగతిం'

యను భగవన్నిందావచన విషయులగుదురు. గాన పైని నిరూపితమగు శాస్త్రవిధి ననుసరించి వైదికధర్మాభిమానులు ప్రవర్తించి యైహికాముష్మిక నిశ్శ్రేయసముల నందుదురుగాక.

ఇతి శ్రీ

# ఆపస్తంబసూత్రీయ వైశ్వదేవప్రయోగః

---

సిద్ధమన్నమితి పాకకర్త్రా ఉక్తేసతి బ్రాహ్మణో యజమానః "తత్సుభూతం సావిరాడన్నం తన్మాక్షాయి" ఇతి సంమంత్ర్య ఆచమ్య – దేశకాలౌ సంకీర్త్య...గోత్రస్య...శర్మ నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ అన్న సంస్కారద్వారా స్వర్గాదిఫలావాప్త్యర్థం ప్రాతః (సాయం) వైశ్వదేవ మహం కరిష్యే – ఇతి సంకల్ప్య – అన్నమౌపాసనాగ్నావధిశ్రిత్య – ఉదగుద్వాస్య – గాయత్ర్యాద్భిః ప్రోక్ష్య అభిఘార్య– సాయంప్రాతరౌపాసనవత్ అగ్నౌ సమిదాధానాది పూర్వపరిషేచనాంతం కృత్వా – హస్తేన జుహుయాదథ స్తనాహుతీష్షట్

1. అగ్నయేస్వాహా – అగ్నయ ఇదంనమమ
2. విశ్వేభ్యో దేవేభ్యస్స్వాహా – విశ్వేభ్యో దేవేభ్య ఇదంనమమ
3. ధ్రువాయ భూమాయ స్వాహా – ధ్రువాయభూమాయ ఇదంనమమ
4. ధ్రువక్షితయేస్వాహా – ధ్రువక్షితయ ఇదంనమమ
5. అచ్యుత క్షితయేస్వాహా – అచ్యుతక్షితయ ఇదంనమమ
6. అగ్నయేస్విష్టకృతేస్వాహా–అగ్నయేస్విష్టకృతఇదంనమమ

ఇతి షడ్ఢోమానభిఘారితేనాన్నేనహుత్వా – ఉత్తరపరిషేచనం కృత్వా సూపమిశ్రితాన్నేన బలీన్ తత్తత్స్థానే హరేత్ ద్వయోః హస్తేన పరిమృజ్య అవోక్ష్య –

పరిషిచ్య - దశానాం హస్తేన పరిమృజ్య - అవోక్ష్య
13. పృథివ్యైస్వాహా - పృథివ్యా ఇదం నమమ
14. అంతరిక్షాయస్వాహా - అంతరిక్షాయేదం నమమ
15. దివేస్వాహా - దివ ఇదం నమమ
16. సూర్యాయస్వాహా - సూర్యాయేదం నమమ
17. చంద్రమసే స్వాహా - చంద్రమస ఇదం నమమ
18. నక్షత్రేభ్యస్స్వాహా - నక్షత్రేభ్య ఇదం నమమ
19. ఇంద్రాయస్వాహా - ఇంద్రాయేదం నమమ
20. బృహస్పతయేస్వాహా - బృహస్పతయ ఇదం నమమ
21. ప్రజాపతయే స్వాహా - ప్రజాపతయ ఇదం నమమ
22. బ్రహ్మణే స్వాహా - బ్రహ్మణ ఇదం నమమ
—బ్రహ్మసదనే (గృహమధ్యే గృహ్యాగ్నేర్దక్షిణతోవా) దశానాం పరిషిచ్య - ప్రాచీనావీతీ హస్తేన పరిమృజ్య - అవోక్ష్య-
23. స్వధాపితృభ్యస్స్వాహా-పితృభ్య ఇదం నమమ (గృహ్యాగ్నే ర్దక్షిణతః) అప్రదక్షిణం పరిషిచ్య - ఉపవీతీ-హస్తేన పరిమృజ్య - అవోక్ష్య -
24. నమో రుద్రాయ పశుపతయే స్వాహా - రుద్రాయ పశుపతయ ఇదం నమమ - (పితృబలేరుత్తరతః) పరిషిచ్య - శాకాదికం గృహ్యాగ్నే రుదీచీనోష్ణభస్మని తూష్ణీం జుహుయాత్ - పాత్రవైశ్వదేవం ఏతావదేవ-
25. యే భూతాః ప్రచరంతి నక్తం బలిమిచ్ఛంతో వితుదస్య ప్రేష్యాః తేభ్యో బలిం పుష్టికామోహరామిమయిపుష్టిం

పుష్టిపతిర్దధాతు స్వాహా. ఇతి మంత్రేణ వైహాయసబలి మాకాశే ఉత్క్షిపేత్. రాత్రావేవ.

అథ భిక్షుం అతిథించ ఆకాంక్షమాణః గోదోహమాత్రకాలం ప్రతీక్షేత. యదిలభ్యేత పూజాపురస్సరం దేవతా బుద్ధ్యా సంతర్పయేత్ తూష్ణీం. యది న లభ్యేత లుక్ష్యతే భిక్షాంతి దద్యాత్—

అథ గృహేవిద్యమానాన్బాల గర్భిణీ బాంధవాన్సం భోజ్య అంతే యజమానః పత్నీచ భుక్త్వా- అమత్రేభ్యో శేషాన్నం కృత్వా అద్భిస్సంసృజ్యగృహాత్తరతః శుచౌ దేశే నినయేత్. 'రుద్రాయ ఇదం నమమ'— ఇతి త్యాగంజప్త్వా గృహాగ్నిసకాశమాగత్య 'అనేనమయాకృతేన (సాయం) ప్రాతర్వైశ్వదేవేన భగవాన్సర్వాత్మకః శ్రీయజ్ఞేశ్వర స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు— ఇత్యుదకధారాం సాక్షతాం త్యక్త్వా స్వస్తివాచయీత. సంతిష్ఠతే వైశ్వదేవః.

---

# అశ్వలాయన సూత్రీయ వైశ్వదేవప్రయోగః



అచమ్య, దేశకాలౌ సంకీర్త్య ... గోత్రస్య ... శర్మనామ ధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ అన్నసంస్కారద్వారా స్వర్గాదిఫలార్థం (సాయం) ప్రాతర్వైశ్వదేవమహం కరిష్యే - ఇత్యాచార్య -

హావిష్య మన్న మౌపాసనాగ్నా వధిశ్రిత్య ఉదగుద్వాస్య గాయత్ర్యాద్భిః ప్రోక్ష్య ఔపాసనాగ్నేః ప్రత్యక్ దర్భేషు నిధాయ సర్పిషాభ్యజ్య- పాణితలం హృదయేన్యస్య.

సాయం ప్రాతరౌపాసనవత్ అగ్నౌ సమిదాధానాది పూర్వపరిషేచనాంతం కృత్వా హస్తేన జుహుయాదధస్తన దశాహుతీః.

1. సూర్యాయ స్వాహా (ఇతి ప్రాతః-సూర్యాయేదం నమమ
   అగ్నయే స్వాహా (ఇతి సాయం)-అగ్నయ ఇదం నమమ
2. ప్రజాపతయే స్వాహా-ప్రజాపతయ ఇదం నమమ
3. సోమాయ వనస్పతయే స్వాహా - సోమాయ వనస్పతయ ఇదంనమమ
4. అగ్నీషోమాభ్యాగ్ స్వాహా - అగ్నీషోమాభ్యామిదంనమమ
5. ఇంద్రాగ్నిభ్యాగ్ స్వాహా - ఇంద్రాగ్నిభ్యామిదం నమమ
6. ద్యావాపృథివీభ్యాగ్ స్వాహా-ద్యావాపృథివీభ్యామిదంనమమ
7. ధన్వంతరయే స్వాహా - ధన్వంతరయ ఇదం నమమ
8. ఇంద్రాయస్వాహా - ఇంద్రాయేదం నమమ
9. విశ్వేభ్యో దేవేభ్య స్వాహా-విశ్వేభ్యో దేవేభ్య ఇదంనమమ
10. బ్రహ్మణే స్వాహా - బ్రహ్మణ ఇదం నమమ
    అథోత్తరపరిషేచనం కృత్వా-గృహ్యాగ్నేరుత్తరతః బలిహరణభూమౌ దశానాం పర్యుక్ష్య ప్రాక్సంస్థాం పంక్తింకరోతి

1. సూర్యాయస్వాహా (ఇతి ప్రాతః)-సూర్యాయేదం నమమ
   అగ్నయేస్వాహా (ఇతిసాయం) -అగ్నయ ఇదం నమమ

2. ప్రజాపతయేస్వాహా — ప్రజాపతయ ఇదం నమమ
3. సోమాయ వనస్పతయే స్వాహా—సోమాయ వనస్పతయ ఇదం నమమ
4. అగ్నీషోమాభ్యాగ్ స్వాహా—అగ్నీషోమాభ్యామిదం నమమ
5. ఇంద్రాగ్నిభ్యాగ్ స్వాహా—ఇంద్రాగ్నిభ్యామిదం నమమ
6. ద్యావాపృథివీభ్యాగ్ స్వాహా—ద్యావాపృథివీభ్యామిదం ,,
7. ధన్వంతరయేస్వాహా — ధన్వంతరయ ఇదం నమమ
8. ఇంద్రాయస్వాహా — ఇంద్రాయేదం నమమ
9. విశ్వేభ్యో దేవేభ్యస్స్వాహా—విశ్వేభ్యో దేవేభ్య ఇదంనమమ
10. బ్రహ్మణేస్వాహా — బ్రహ్మణ ఇదంనమమ

దశానాం పరిషిచ్య — పునః ద్వితీయపంక్తౌ పంచానాం పర్యుక్ష్య

11. అద్భ్యస్స్వాహా — అద్భ్య ఇదం నమమ
12. ఓషధివనస్పతిభ్యస్స్వాహా—ఓషధివనస్పతిభ్య ఇదం నమమ
13. గృహాయస్వాహా — గృహాయేదం నమమ
14. గృహదేవతాభ్యస్స్వాహా—గృహదేవతాభ్య ఇదం నమమ
15. వాస్తుదేవతాభ్య స్స్వాహా—వాస్తుదేవతాభ్య ఇదంనమమ

పంచానాం పరిషిచ్య— అష్టానాం పర్యుక్ష్య

16. ఇంద్రాయస్వాహా ఇంద్రాయేదం నమమ (ప్రాచ్యాం
17. ఇంద్రపురుషేభ్యస్స్వాహా — ఇంద్రపురుషేభ్య ఇదంనమమ
18. యమాయ ,, —యమాయేదం నమమ (దక్షిణస్యాం
19. యమపురుషేభ్య ,, —యమపురుషేభ్య ఇదం నమమ ,,
20. వరుణాయ ,, —వరుణాయేదం నమమ (పశ్చాత్

21. వరుణపురుషేభ్య ,, –వరుణపురుషేభ్య ఇదంనమమ ,,
22. సోమాయ ,, –సోమాయేదం నమమ
23. సోమపురుషేభ్య ,, –సోమపురుషేభ్య ఇదంనమమ
—(అష్టానాం పరిషిచ్య

గృహమధ్యే చతుర్ణాం పర్యుక్ష్య
24. బ్రహ్మణే ,, – బ్రహ్మణ ఇదంనమమ
25. బ్రహ్మపురుషేభ్య ,, – బ్రహ్మపురుషేభ్య ఇదంనమమ
26. విశ్వేభ్యో దేవేభ్య,, – విశ్వేభ్యో దేవేభ్య ఇదంనమమ
27. సర్వేభ్యో భూతేభ్యో దివాచారిభ్యస్స్వాహా (ప్రాతః
,, ,, నక్తంచారిభ్యస్స్వాహా —(సాయం)
భూతేభ్య ఇదంనమమ

చతుర్ణాం పరిషిచ్య–గృహోత్తరభాగే పర్యుక్ష్య
28. రక్షోభ్యస్స్వాహా – రక్షోభ్య ఇదంనమమ
పరిషిచ్య–ప్రాచీనావీతీ – అగ్నేర్దక్షిణతః పర్యుక్ష్య
29. స్వధాపితృభ్యస్స్వాహా – పితృభ్య ఇదంనమమ
అప్రదక్షిణం పరిషిచ్య – ఉపవీతీ భూత్వా

భిక్షుం అతిథించ ఆకాంక్షమాణః గోదోహమాత్రకాలం ప్రతీక్షేత – తలబ్ధ్వా దేవతాబుద్ధ్యా పూజాపూర్వకం తూష్ణీం సంతర్పయేత్ –తదలాభే భిక్షాతిథ్యయోర్లోపః. అథగృహీయ గర్భిణ్యాది సంబంధబాంధవాన్సం భోజ్య అంతే యజమానా వశిష్టతః–అథ పాత్రేభ్యో లేపాన్సంకృష్య గృహదక్షిణభాగే తూష్ణీం నినయేత్ –అథ గృహోఽగ్ని సమీపమాగత్య అనేన మయాకృతేన(సాయం) ప్రాతర్వైశ్వదేవేన భగవాన్సర్వాత్మకః శ్రీయజ్ఞేశ్వరస్సుప్రీతస్సుప్రసన్నో వరదోభవతు ఇతి సాక్షతోదకం సమర్ప్య స్వస్తి వాచయీత–సంతిష్ఠతే వైశ్వదేవః–

# కాత్యాయనసూత్రీయ వైశ్వదేవప్రయోగః

ఆచమ్య- దేశకాలౌ సంకీర్త్య ... గోత్రస్య ... శర్మ నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ అన్నసంస్కారద్వారా స్వర్గాది ఫలార్థం (సాయం) ప్రాతర్వైశ్వదేవమహం కరిష్యే ఇత్యాగూర్య - హవిష్యమభిఘారిత మన్నం ఆవసథ్యాగ్నా వధిశ్రిత్య ఉదగుద్వాస్య గాయత్ర్యాద్భిః ప్రోక్ష్య

సాయం ప్రాతరౌపాసనవత్ అగ్నౌసమిదాధానాది పూర్వ పరిషేచనాంతంకృత్వా హస్తేన జుహుయాత్ షడాహుతీ రథ స్తనీః

1. బ్రహ్మణేస్వాహా - ఇదం బ్రహ్మణే
2. ప్రజాపతయేస్వాహా - ఇదం ప్రజాపతయే
3. గృహ్యేభ్యస్స్వాహా - ఇదం గృహ్యేభ్యః
4. కశ్యపాయస్వాహా - ఇదం కశ్యపాయ
5. అనుమతయేస్వాహా - ఇదమనుమతయే
6. అగ్నయే స్విష్టకృతేస్వాహా - ఇదమగ్నయేస్విష్టకృతే-
   ఇతి షడాహుతీర్హుత్వా ఉత్తరపరిషేచనం కృత్వా త్రయాణామభ్యుక్ష్య

1. పర్జన్యాయనమః - ఇదం పర్జన్యాయ } మణికే
2. అద్భ్యోనమః - ఇదమద్భ్యః } మణికే
3. పృథివ్యైనమః - ఇదం పృథివ్యై } మణికే

త్రయాణాం పరిషిచ్య - ద్వయోరభ్యుక్ష్య

4. ధాత్రేనమః - ఇదం ధాత్రే } ద్వార్యయోః
5. విధాత్రేనమః - ఇదం విధాత్రే } ద్వార్యయోః

ద్వయోఃపరిషిచ్య - ప్రాచ్యామభ్యుక్ష్య
6. వాయవేనమః - ఇదం వాయవే
7. ప్రాచ్యై దిశేనమః - ఇదం ప్రాచ్యైదిశే
పరిషిచ్య దక్షిణస్యామభ్యుక్ష్య
8. వాయవేనమః - ఇదంవాయవే
9. దక్షిణాయై దిశేనమః - ఇదం దక్షిణాయైదిశే
పరిషిచ్య - ప్రతీచ్యామభ్యుక్ష్య -
10. వాయవేనమః - ఇదం వాయవే
11. ప్రతీచ్యైదిశే నమః-ఇదం ప్రతీచ్యైదిశే-
పరిషిచ్య ఉదీచ్యా మభ్యుక్ష్య
12. వాయవేనమః - ఇదం వాయవే
13. ఉదీచ్యైదిశేనమః - ఇదముదీచ్యైదిశే -
పరిషిచ్య గృహామధ్యేభ్యుక్ష్య
14. బ్రహ్మణేనమః - ఇదం బ్రహ్మణే
15. అంతరిక్షాయనమః - ఇద మంతరిక్షాయ
16. సూర్యాయనమః - ఇదగ్ం సూర్యాయ - త్రయాణాం
పరిషిచ్య - తదుత్తరతః ద్వయోరభ్యుక్ష్య
17. విశ్వేభ్యో దేవేభ్యోనమః - ఇదం విశ్వేభ్యో దేవేభ్యః
18. విశ్వేభ్యో భూతేభ్యోనమః - ఇదం విశ్వేభ్యోభూతేభ్యః
ద్వయోఃపరిషిచ్య - తదుత్తరతః ద్వయోరభ్యుక్ష్య
19. ఉషసేనమః - ఇదముషసే
20. భూతానాం పతయేనమః - ఇదం భూతానాం పతయే

ద్వయోః పరిషిచ్య – ప్రాచీనావీతీ ఆవసథ్యాగ్నేర్దక్షిణతః
అభ్యుక్ష్య

21. పితృభ్యస్స్వధానమః – ఇదం పితృభ్యః – అప్రదక్షిణం పరిషిచ్య – ఉపవీతీ

భిక్షుకమతిథించ గోదోహకాలమాత్రం ప్రతీక్ష్య తల్లాభే దేవతాదృష్ట్యా సంపూజ్య 'హంతతే' ఇతి మంత్రేణ అన్నం దద్యాత్. తదలాభే తల్లోపః_గర్భిణ్యాది సంబంధబాంధవాన్సంభోజ్య అంతే గృహపతిః పత్నీచ ప్రాశ్య పాత్రం నిర్ణిజ్య ఉత్తరాపరస్యాందిశి 'యత్స్మైతత్తేతతః' ఇతి మంత్రేణ నినీయ_ ఆవసథ్యాగ్నిసమీపమాగత్య 'అనేన మయాకృతేన (సాయం) ప్రాతర్వైశ్వదేవేన భగవాన్సర్వాత్మకః శ్రీయజ్ఞేశ్వర స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు' ఇతి సాక్షతోదకం సమర్ప్య స్వస్తి వాచయీత_ సంతిష్ఠతే వైశ్వదేవః.

## అథ విధుర వైశ్వదేవకల్పః

విధురాస్తు పచనాగ్నే రుదీచోంగారా న్నిరూహ్య "పృష్ఠోదివీ" తిమంత్రేణ సమిధమాధాయ స్వసూత్రోక్తవిధినా వైశ్వదేవం కుర్వీ రన్నితివిజ్ఞాయతే_

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | శుద్ధపాఠము |
|---|---|---|---|
| 3 | 16 | యజ్ఞము నెపుడు | యజ్ఞముల నెపుడు |
| 7 | 16 | మనుకర | మనుకర్మ |
| 10 | 20 | ణేభ్యో | హ్మణేభ్యో |
| 12 | 6 | సామాధ్వరణ | సామాధర్వణ |
| 12 | 21 | అస్త్రీయ | అశాస్త్రీయ |
| 13 | 22 | అ్నయే | అగ్నయే |
| 16 | 6 | అభిశస్తైచ్ఛ | అభిశస్తాచ్ఛ |
| 16 | 20 | అగ్నిహెూత్రనుతిథీ | అగ్నిహోత్రమతిథ |
| 18 | 1 | సూత్రములచే లేదా | సూత్రములచే వేస |
| 18 | 2 | ముల నధ్వయనము | ముల నధ్యయనము |
| 27 | 17 | అహెూక్ష్య | అహోక్ష్య |
| 29 | 19 | వెహాయస . | వైహాయస |
| 30 | 3 | ప్రమామలేర్వ | ప్రమాణములే |
| 30 | 4 | పూణవృత్తి | పూర్వ స్మృతి |
| 33 | 5 | భసమందు | భస్మమందు |
| 33 | 14 | అమత్రలేపవముల | అమత్రలేపముల |
| 35 | 22 | పూర్ణిమావాస్య | పూర్ణిమామావాస |
| 36 | 1 | 9 | 11 |
| | 22 | హోమమత్రాదుల | హోమమంత్రాదుల |
| 39 | 1 | య మనుష్య | యజ్ఞో మనుష్య |
| 40 | 13 | వికుగూడ | వీకుగూడ |
| 42 | 17 | ఋగ్వేదేనహూతా | ఋగ్వేదేన హెూ |
| 44 | 2 | జ్ఞేయాశుతి | జ్ఞేయాశ్రుతి |
| 46 | 18 | స్విష్టకృత ఇదం | స్విష్టకృతే మ ఇదం |

# శ్రీ విద్యాపరిషద్వ్యాసరత్నావళి

---

1. శ్రీ కృష్ణభగవన్మహాశయము
2. ప్రజావైచిత్ర్యము
3. పిండపితృయజ్ఞమీమాంసా
4. వైశ్వదేవమీమాంసా
5. బ్రహ్మయజ్ఞమీమాంసా
6. సర్వదేవతాప్రతిష్ఠామీమాంసా
7. వివాహమీమాంసా
8. షడ్దర్శనమీమాంసా
9. మన్వర్థమీమాంసా

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్‌బజార్, హైదరాబాద్. 1.

# శ్రీ విద్యాపరిషత్

---

బ్రహ్మవిద్యాప్రవక్తారం నారాయణజగద్గురుం
శాసితారంచ ధర్మస్య స్వాయంభువమనుంపరం
యోగశాస్త్రప్రవక్తారం శ్రీకృష్ణపురుషోత్తమం
వేదవ్యాసంచ వేదాంతమీమాంసాయాః ప్రవర్తకం
జైమినిం ధర్మమీమాంసాశాస్త్రకారం మహామతిం
బోధాయనాపస్తంబాది కల్పసూత్రప్రవర్తకాన్
కారికాణాంచ కర్తారం గౌడపాదం మహామునిం
వ్యాఖ్యానాధీశ్వరం ధీరం శ్రీవిద్యాశంకరంపరం
వార్తికానాంచ వక్తారౌ కుమారిలసురేశ్వరౌ
సర్వవేదార్థవక్తారం విద్యారణ్యమహాశయం
సర్వతంత్రస్వతంత్రం శ్రీబోధానందగురుంపరం
అభిపూజ్యయథాన్యాయం మనోవాగ్దేహసాధనైః
సర్వవేదార్థమీమాంసాం వ్యాకరోతియథామతి
హర్షాయచసుభక్తానాం శ్రీవిద్యాపరిషత్సదా.

1. ధర్మాయస్వాహా - ధర్మాయ ఇదం నమమ } అపరేణాగ్నిం
2. అధర్మాయస్వాహా-అధర్మాయ ఇదంనమమ } (ఉదగపవర్గం)
ద్వయోః పరిషిచ్య - హస్తేన పరిమృజ్య - అవోక్ష్య
3. అద్భ్యస్స్వాహా - అద్భ్య ఇదంనమమ - (ఉదధానసన్నిధౌ)
పరిషిచ్య - ద్వయోఃహస్తేన పరిమృజ్య - అవోక్ష్య-
4. ఓషధివనస్పతిభ్యస్స్వాహా_ఓషధివనస్పతిభ్య ఇదం నమమ
(మధ్యే అగారస్య(ప్రాగపవర్గం)
5. రక్షోదేవజనేభ్యస్స్వాహా _ రక్షోదేవజనేభ్య ఇదం నమమ
ద్వయోః పరిషిచ్య _ చతుర్ణాం హస్తేన పరిమృజ్య -
అవోక్ష్య-
6. గృహ్యేభ్యస్స్వాహా _ గృహ్యేభ్య ఇదం నమమ
7. అవసానేభ్యస్స్వాహా - అవసానేభ్య ఇదం నమమ
8. అవసానపతిభ్యస్స్వాహా _ అవసానపతిభ్య ఇదం నమమ
9. సర్వభూతేభ్యస్స్వాహా _ సర్వభూతేభ్య ఇదం నమమ
చతుర్ణాం పరిషిచ్య _ హస్తేన పరిమృజ్య - అవోక్ష్య-
-(ఉత్తర పూర్వదేశే అగారస్య (ప్రాగపవర్గ ముదగప
వర్గంవా)
10. కామాయస్వాహా_కామాయ ఇదంనమమ (శయ్యాదేశే)
పరిషిచ్య - హస్తేనపరిమృజ్య - అవోక్ష్య-
11. అంతరిక్షాయస్వాహా-అంతరిక్షాయఇదంనమమ(దేహళ్యాం)
పరిషిచ్య _ హస్తేన పరిమృజ్య - అవోక్ష్య
12. యదేజతి జగతి యచ్చ చేష్టతి నామ్నో భాగోయం
నామ్నే స్వాహా - వాయవ ఇదం నమమ (అపిధాన్యాం)

హోమయోగలక్షణ మర్థానికి లేకపోవుటచే నట్టి వైశ్వదేవా భాసము అశాస్త్రీయమగుచు ననర్థదాయక మగును.

ఇక శేషేతి కర్తవ్యము నిట్లు ఆపస్తంబు లుపదేశించు చున్నారు. 'సిద్ధేన్నే తిష్ఠన్ భూతమితి స్వామినే ప్రబ్రూయాత్ తత్సుభూతం విరాడన్నం తన్మాక్షాయీతి ప్రతివచనం. అను సూత్రములచే వంట సిద్ధము కాగానే యజమాని 'తత్సుభూతం విరాడన్నం తన్మాక్షాయి' యని పఠించవలెను. ఆపైని ౨-౩-౧౬ నుంచి 'షడ్భిరాద్యైః ప్రతిమంత్రం హస్తేనజుహుయాత్' అను సూత్రముచే మంత్రప్రశ్న పఠితక్రమమున మొదటి యారుమంత్రములతో హోమము చేయవలెనని బోధించెను. పార్వణ ధర్మాతిదేశముచే స్రువముచే హోమము ప్రాప్తించగా అయ్యది 'హస్తేన' యను పదముచే వారింపబడుచున్నది. ఇచట పార్వణ ధర్మాతిదేశముచే 'దర్భై రగ్నిం పరిస్తృణాతి' ఇత్యాది కలాపమంతయు ప్రాప్తముకాగా 'ఉభయతః పరిషేచనం' అను సూత్రముచే పై షడాహుతులకు పూర్వమందు పరిషేచనమున్ను హోమాంతమం దుత్తరపరిషేచనమున్ను చాలునని నియమించుచున్నారు.

ఇంతవరకు 'అనభిఘారితశ్చరుహవిః' యను పరిభాష ననుసరించి ఆజ్యాభిఘారముతో గూడిన కేవలాన్నముతో హోమరూపమగు వైశ్వదేవమును బోధించి ఇకమీద బలిరూపమగు వైశ్వదేవమును బోధింపదలచి తద్విధ్యము నుపదేశించుచున్నారు. 'సూపసంసృష్టేన బలయః కార్యాః' యను సూత్రముచే సూపముతో కలపబడిన పై అన్నముతో వక్ష్య